సంగీత

# చంద్రకాంత

[ఆఱంకముల నాటకము]



గ్రంథకర్త:

కొడాలి సత్యనారాయణ రా



ప్రకాశకులు

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు

నేషనల్ బుక్కు డిపో, రాజమహేంద్రవరము.

మొదటి కూర్పు 1000 ప్రతులు

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము

 1925 [వెల 0—12—0

# మహానంద

గ్రంథకర్త:—కొడాలి సత్యనారాయణరావుగారు

ఇది సినీమాప్లాటు ననుసరించివ్రాయబడిన భక్తిరసప్రధాన నాట్యరాజము శివస్తోత్రములు శ్రీనరానందకరములు పద్యములు రసవంతములు భావము లత్యద్భుతములు ఎందరో కవించిరిగాని ప్రదర్శనార్థమై ఎన్నెదో నాటకసమాజములు వీరినాటకమునే అర్థిం చున్నందున మేమువేరుగా వ్రాయనవుసర ముండదు. వెల 0-12-0

## శారదావిజయము

ఇది కొడాలి సత్యనారాయణగారిచే రచియింపఁబడిన సాంఘి కనాటకము యిందు శారదామాధవులు పెక్కుకష్టములకు లోనై చివరకు సౌఖ్యదశ ననుభవింతురు. ఇతివృత్తము చక్కగా పోషింపఁ బడినది. వెల 0—12—0

## రసపుత్రవిజయము

గ్రంథకర్త:—ద్రోణంరాజు సీతారామారావుగారు ఇది విమలాదేవి నవల ననుసరించి వ్రాయబడిన నాటకము. రాజమ హేంద్రవర శ్రీ చింతామణీ నాటకసమాజము డాక్టరు కీర్తిశేషు లైన అల్లక చంద్రసేఖరము గారిచే రచింపఁబడిన కీర్తలతో నల రుచున్నది. వెల 1—0—0

## ఎడ్డీపోలో

కర్త:—వి. నాగరాజుగారు. (U. S. E.)

సినిమాప్లాటు ననుసరించి వ్రాయబడిన పరిశోధకనవల వెల 1-0-0

సంగీత

# చంద్రకాంత

ఆఱంకముల నాటకము

గ్రంథకర్త

కొడాలి సత్యనారాయణరావుగారు



ప్రకాశకులు

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు

నేషనల్ బుక్కు డిపో

రాజమండ్రి

1925



వెల 0—13—0

# పీఠిక

ఊరూర నాలుగేసి నాటకసంఘములున్న దినములలో నేను వారమునకు మూఁడేసిసారులు రంగస్థలముల కెక్కిన దినములలో సరదాగా వ్రాసిన యీచిన్న నాటకమును నామిత్రులైన టి. వి. రమణయ్య బ్రదర్సువారు చదివించుకొని దీనిని ముద్రింపింతు మనిబలవంతమున లాగికొనుటచేఁ బసికాలమున వ్రాసిన నాటకము గూడ మచ్చునకచ్చుపడిన మంచిదే యెందులకైననని యిచ్చివేసి తిని. నవరణలొనర్ప ప్రథమకూర్పునకు నాకిష్టములేకుండెను. ఇది పాఠకమహాశయుల కెంతవఱకు రుచించుచునో! ప్రకాశకులకు వందనశతంబులతో నీవిజ్ఞప్తి విరమించు

శనివారప్పేట.<br>
ది 1–7–1925

మీసేవకుఁడు<br>
గంధకర్త

## —• పాత్రములు •—

**పురుషులు.**

1 చంద్రచూడుఁడు
2 వీరసేనుఁడు
3 ద్వారికుఁడు
4 దూర్వాసుఁడు
5 పరమేశ్వరుఁడు
6 విజయసేనుఁడు
7 సింహకేతుఁడు
8 దీర్ఘదర్శి
9 నాగేశ్వరావధానులు
10 రామశాస్త్రి
11 శిష్యుఁడు
12 నారదుఁడు
13 అశ్వనీకుమారులు
14 తాండవభట్టు
15 బడిబాలురు
16 దుర్మతి
17 దుష్టబుద్ధి

**స్త్రీలు.**

చంద్రవదన
పార్వతి
కనకవల్లి
కాంచనమాల
రత్నమాల
కాళి

# కృతిసమర్పణము

చిన్ననాటఁ గోలె నన్న పానీయము లిచ్చి విద్యాబుద్ధులు
నేర్పించిన మహానీయులును, న్యాయవాదులును
వేమనతోఁ దుల్యు లనఁదగిన వేదాంతశీలురు
నగునాభావగారు కీర్తిశేషులు వేమవరపు
ప్రసాదరావుపంతులుగారి యాత్మ
శాంతికిఁకృతి మనఃపూర్వక
ముగా సమర్పించుకొను
చున్నాఁడను.

గ్రంథకర్త

# సంగీత చంద్రకాంత నాటకము

## ప్రథమాంకము

ప్రదేశము. రాజదర్బారు.

ప్రవేశము. చంద్రచూడుఁడు. మంత్రి. వీరసేనుఁడు.

రాజు:—అమాత్యశేఖరా! మనపాలనంబునఁ గల ప్రజలెల్లరు సుఖులై యున్నవారే? భూములు చక్కఁగఁ బండుచున్నవా? ఎవరికిని యెట్టి బాధలు లేవుగదా? మనయుద్యోగీయులు దయాసత్యశౌచంబులఁ జక్కఁగఁ గాపాడుకొనుచుండిరా?

మంత్రి—దేవా! దేవరవారి పాలనం బతిరమణీయంబుగఁ దనరారుచుండ, రాజకీయోద్యోగులు ప్రభుభక్తి పరాయణులై, దేశసేవాధురంధరులై, ప్రజాక్షేమాభిలాషులై సంచరించుచుండ ప్రజలు తమ తమ వర్ణాశ్రమధర్మంబుల నీతిఁదప్పక ననుష్ఠించుచుండ నెవరికెట్టి కొఱఁతలు గలుగును? మహాప్రభూ! దేవరవారి కీయనుమానమేల కలిగెనో తెలియకున్నయది-నతతంబును బ్రభువువారి సముఖంబునకు విచ్చేసి యెప్పటి విశేషంబుల నప్పుడే విశదపరచుకొనుచుండు సందర్భమున మీ సేవకుని మఱల నీపరీక్షయొనర్చు టవునరమా? ప్రభూ!

రాజు—వీరసేనా? అవును. నిన్నటిరాత్రినుండియు నేదియో యారటముననున్న నామనంబే యిందులకుఁ గారణమైనది సుమా!

మంత్రి—దేవా!

సీ. భూజ్యమై బహుధన । ప్రాజ్యమై నిరతసం
భోజ్యమైయొప్పు సా । మ్రాజ్యముండ,
సురకాంత విశ్రాంత । సురకాంతలకుఁ గల్గు
కాంతులం దెగడెడు । కాంతలుండ,
మందార సందోహ । బృందారక గజేంద్ర
కుందసుందర యశో । బృందముండ
రాజరాజ తనూజ । రాజదక్ష్మరాజ
రాజితసౌందర్య । రాజియుండ,
నేల యీరాట మోహమహీ । పాల! కొఱఁత,
లేమిః విపరీతగతినుం । డు టేమి! వి నఁగ,
సర్వుఁడనయేని సెలవిడ । రయ్య నాదు,
ప్రశ్నమున కలుకబూనక । ప్రభువరేణ్య.

రాజు—మంత్రిపుంగవా! ఇవన్నియు నున్నంతమాత్రమునఁ బరితా
పమే గలుగదా! చూఁడు—

సీ. వీనుల విందుగా । వినిపింప జిలిబిలి,
పలుకులు పలికెడి । బాలుఁడేడి!
ఘుమ ఘుమ వాసనల్ । గొలుప నాఘ్రాణించు,
పున్నాంబు పుట్టించు । పుత్రుఁడేడి!
తనయా! యనుచు నంక । తలమున గూర్చుండఁ,
జూచుక ముద్దాడు । సూనుఁడేడి!
అల్లాగ ముద్దుగా । నాటలాడుచునుండ,
గనిహర్షమును జెంద । తనయుఁడేడి?
వంశమింతట నాతోడి । ధ్వంసమంద
కుండ రక్షింప గలిగెడి । కొమరుఁడేడి?
సంపద లెన్నియున్నను । సకలభోగ
ములను పొందుచున్ననుగాని । ఫలమదేది?

మంత్రి—దేవా! ఇది విచారణీయాంశమే గాని సకల ధర్మస్వరూపు లగు దేవర యెడల జగదీశ్వరుండగు నీశ్వరుండు కనికింప కుండునా?

రాజు—మందభాగ్యుడనగు నాకట్టి మహదైశ్వర్యంబు చిక్కునే? ఏదియైనను తొలిపుట్టువున నెంత సుకృతముగావించు కొంటి మో యంతే ఫలితం బందగలము.

దౌవా—(ప్రవేశించి) మహారాజా! మహాతపోధనుండగు దూర్వా సమహర్షి దేవర దర్శనార్థియై హాజారముకడ నిలబడియు న్నవారలు.

రాజు—వీరసేనా! నీవు శైశంబజని యతిసులభకోపనుండగు నమ్మౌనివరుని బిరబిర దోడ్కొనిరమ్ము.

మంత్రి—(నిష్క్రమించి మఱల మౌనితోడ బ్రవేశము)

రాజు—(సింహాసనమునుండి లేచి) మునీంద్రా! భవదీయ పాదసేవ కుడు చంద్రచూడుడిదె ప్రణమిల్లుచున్నవాడు.

దూర్వా—శ్రేయో భూయో, భూయో, భూయాత్.

రాజు—దేవా! ఈమణిపీఠం బలంకరింపుడు

దూర్వా—(కూర్చుండి) రాజా! నీవును కూరుచుండుము. ఓవసుమ తీపతీ! సకుటుంబసపరివారసహితముగ నీకు క్షేమమా?

రాజు—మీదయావిశేషమున నింతవఱకు. దేవా! భవదీయ రాక వలన నామందిరంబు పవిత్రమై మదీయజన్మ ధన్యమైనది.

దూర్వా—రాజా! ఇప్పుడు నేనొంటరిగ వచ్చినవాడనుగాను. శిష్యబృందముతో వచ్చితి. వారీపురి సమీపంబున గలనొక తోటలో విడిసియున్నారు. ఎవరినైన బంపి వారికి దగిన వసతుల నేర్పరుచుట యావశ్యము—

రాజు—చిత్తము. (మంత్రితో) వీరసేనా! మానిపుంగవుని యానతి మేఱకు నట్లొనర్పఁజూమ్ము. మఱియు నొకసంగతి. అర్ఘ్యపాద్యాది పూజోపకరణములతో నా దేవేరి నిటకు వచ్చునట్లొనర్పుము.

మంత్రి—చిత్తము. (నిష్క్రమించును)

(చంద్రవదన ప్రవేశము)

రాజు—దేవీ! అపరశివావతార మననొప్పు నీమహాత్ముఁడు దూర్వాసమహర్షి. మనయందుఁ బరిపూర్ణవాత్సల్యముండుట చేత నేడిటకువిచ్చేసి మనలను ధన్యులుగఁజేసెను. కాన తొలుదొల్త నిమ్మహర్షికిఁ బ్రణమిల్లి యాశీర్వాదమందుము.

చంద్ర—మహాత్మా! ఇదె ప్రణమిల్లెద.

దూర్వా—వీరమాతా! భూయాస్తే. శ్రేయో, భూయో, భూయో భూయాత్.

రాజు—(హర్షమునఁ దనలో) అమోఘవచస్కుండగు యిమ్మౌని వచనంబులు సార్థకము గాకుండునా? (ప్రకాశముగా) దేవీ! ఇమ్మౌనీంద్రునకుఁ బాదప్రక్షాళన మాచరించెద. నీరము వోయుము. దేవా! భవదీయ పాదపద్మముల నిటు తెండు.

దూర్వా—(అట్లొనర్చును)

రాజు—(పాదంబులు గడుగుచు నీరము నెత్తిపైఁ జల్లుకొని) దేవా!

రాగం-కాఫీ-తాళం ఏక॥

పవిత్రుఁడనైతిఁ దేవా! ॥పవి॥

పాపపుంజములు పటాపంచలయి ॥పవి॥

పాదతోయములు మీద జల్లుకొన,

నాదరిద్ర మంతయు నశియించెను ॥ప॥

దూర్వా—రాజదంపతులారా! మీ సపర్యలచే నానందుఁడనైతిని. నేను నాశిష్యగణముతో నీయింట విందారగింపనిశ్చయించితి

చితి. కాన పెందలకడ వంటకములు సిద్ధపఱచు తెఱవాలో
చించుము—

రాజు—దేవా! ఇందునగూర్చి తా పర్థింపవలయునా?

చంద్ర—అన్నియును సిద్ధముగనే యున్నవి. తామింక ననుష్ఠానంబు
లన్నియుఁ దీర్చుకొనఁ దగును—

దూర్వా—రాజా! ఒకసంగతి-నే నిటు లంటినని మనంబున వేఱు
గ తలంచకుము.

గీ. పుత్రసంతతిలేనట్టి । పురుషునింట
భోజన మొనర్పగాబోము । భూమిపాల

(రాజును జూచి) రాజా! అటుల తెల్లబోవుచు నుంటివేమి? పుత్ర
హీనుఁడవా యేమి?

రాజు—(నిరుత్తరుఁ డగును.)

దూర్వా—రాజా! మారు పలుకవేమి? పుత్రహీనుఁడవేనా?

రాజు—

గీ. మందభాగ్యుఁడ! నిజముగా । నందనునకు
నోచగానైతి నేమియుఁ । దోచకుంట
శిరము నెత్తంగలేక యీ । కరణిమీరు
పలుకగానైతి క్షమియింప । వలయునన్ను.

దూర్వా—(కోపముతో జడలఁ జిమ్ముకొనుచు) ఓరీ! మోసకారీ!
అనపత్యుఁడవు నీవు మహాగృహస్తునివలె నా కాతిథ్యమిచ్చు
ట కెట్లు సమ్మతించితివిరా! దుర్మార్గా! నిన్నిపు డేమిగావిం
తునో చూడుము.

రాజు—మహాత్మా! క్షమియింపవలయును. దివ్యజ్ఞానసంపన్నులగు
తమకుఁ దెలియని యంశ ముండదని నే నిది తెలుపుకొన
నైతిని గాని వేఱొండు లేదు. (పాదములపైఁ బడును.)

దూర్వా—(అవతలకు విదలించుచు) ఏమిరా! కపటశీలా! వాగెదవు. నాకుఁ దెలిసినను దెలియకున్నను తొలుదొల్త నాశిష్యబృందముతో నీయింట నేను విందుఁ గుడిసెదనని తెలుపుకొనినపుడు నీగుట్టును వెలిబెట్టుకొనక కపటంబున నావ్రతమును భంగపఱచి మోసపుచ్చఁ జూచితివిగా.

గీ. లోన గరళంబు బోయుచుఁ । బైని పాల
చేతనింపినకుంభము । భాతినీవు
మమ్ము వంచింపఁబూనితో । మనుజపాంస
ఫల మొసంగెద గొనుము రా । తులువ! పలువ.

రాజు—(చేతులు జోడించుకొని)

క. తప్పు క్షమింపుము తమకున్
జెప్పఁగ నే నెంతవాఁడ । శిష్యుఁడ మీకున్
కప్పపై నప్రు మేటికి
యొప్పునె మీకింత కోప । మో మునివర్యా.

దూర్వా—ఛీ! ఛీ! వంచకా! సిగ్గుమాలి నీ వీగతి నాచరించఁ దగునే మానవాధమా! మాయట్టి తపస్సంపన్నుల నీ వీగతి మోసపుచ్చి బాపుకొనఁగలిగిన దేమిరా? పయోముఖవిషకుంభమవు. నీమోముఁ దిలకించిన మహాపాతకము చేకూఱును. నిన్నింక మదీయశాపదవానలంబున కాహుతిఁ జేసినఁగాని నాకోప మాఱదు.

రాజు—(పాదములపైఁబడి) మహాత్మా! రక్షమాం! రక్షమాం!

రాగం నాదనామక్రియ—రూపకతాళం.

దీనపాలకా నాకిఁక-దిక్కునీవె గావుమయ్యా!
నూనునిపై నలుక నిటుల-జూపిన నెటుబ్రతుకుదునె ॥దీ॥

కరుణామయా పదములఁబడి-శరణంచును వేఁడువారల।
కరుణమాలి శాపాగ్నిని-గాల్చుటె యిది ధర్మముగున ॥దీ॥

దేవా! ఆగ్రహమునుండి తాము విముక్తు లగువఱకును నే నీపాద పద్మంబుల వీడఁజాలను—

దూర్వా—(తనలో) పాప మనపత్యుఁడై కుందుచున్న యీరాజ దంపతులపై నేను రోషించుట పాడిగాదు. (ప్రకాశముగా) రాజా! లెమ్ము—మీకు పుత్రసంతతి గలుగు నుపాయం బొండు దెల్పెద.

రాజు—(లేచి) కరుణామయా! సావధానుఁడనై వినియెద.

దూర్వా—నే నిప్పు డొక్క-మంత్ర ముపదేశింతు. దానిం గానకుఁ బోయి నీమంబునఁ బునశ్చరణ మొనర్తువేని నుమాపతి నీ యెడఁ బ్రిసన్నుఁడై నీయభీష్ట మీడేర్పఁగలఁడు. (అని చెవిలో మంత్రోపదేశ మొనర్చి) యజుర్వేదంబునకు నాభియగు నిమ్మహామంత్రమహిమచే మీకు త్తమపథం బలవడుఁగాక. రాజా! నేనింకఁ బోయివత్తు. పుత్రవంతుఁడవైన యనంతరంబున మఱల నీయింటికివచ్చి యాతిథ్యము గ్రహించి నిన్ను నంతోషపరిచెద.

రాజు—(తనలో) నీకోపము నాపాలి మనునట్లు సర్వలోక భయంకర కోపనుం డగు నీదూర్వాసుని కోపము నాకు మేలే యొన రించినది. (ప్రకాశముగా) మునీంద్రా! నేనిప్పటికి మీచేఁ జిక్క-ఁగా ననుగ్రహింపఁ బడికృతార్థుఁడనైతిని. శిష్యునిపై దయతప్పవలదు.

దూర్వా—మంచిది నేను చెప్పినట్లుచేయుము. ఇంకఁబోదును.

రాజు—దేవా! వందనంబులు.

రాణి—మహాత్మా! వందనంబులు.

దూర్వా—అభీష్టప్రాప్తిరస్తు (దూర్వాసుని నిష్క్రమము)

రాజు—దేవీ! మునిచంద్రుని యానతి మీఱకుఁ దపంబొనర్ప వనం
బులకుఁ జనియెద. నీవుగూడ సర్వమంగళ వ్రతోపవాసాది వి
ధులచే గౌరీదేవి నారాధించుచు నింటనే నేవచ్చుదనుకఁ గాలం
బుఁ బుచ్చుచుండుము.

రాణి—ఆర్యపుత్రా! ఊటుకొమ్మను దప్పిన లతికపగిది మిమ్మునెడ
బాసి యొక్కనిముసమైన నిలువఁగలనా! మీదండనుండి మీ
పరిచర్యలొనర్ప ననుగ్రహించుడు.

రాజు—దేవీ!

గీ. క్రూరమృగ సంకులంబయి । ఘోరనాద
ములకు తానంబునై యువి । దలకుపాడలు!
దోఁపఁ జేసెదు వనమేడ? । తోయజాక్షి?
నీవునిలుచుట వేడ రా । లేవు నీవు.

రాణి—పతివాక్యము సతిగడచుట సతులకుచితము గాదు గాన తమ
యాజ్ఞానువర్తినై యిచ్చటనేయుండి గౌరినారాధించెద.

రాజు—దేవీ! మనమింక వెడలెదమా! కాలాతీతమేల? తపోవనంబు
నకరుగుటకు దగుపరికరముల సిద్ధపరచుకొనవలయుఁగదా!
చూఁడు.

ఉ. కావలెఁగావిబట్టలు; మ । గంబునఁదాల్ప విభూతిపండ్లు గౌ
రీవరునామ మంత్రముస్మ । రింపఁగహస్తమునందు మాలికల్
గావలెఁగాఁగమండలము । కావలె వీటిని సేకరింపగా
బోవలెఁగాదె యోరమణి । బోదము జాగదియేలరమ్మికన్॥

రాణి—చిత్తము.

(నిష్క్రమింతురు)

———

## ద్వితీయరంగము.

రాజు తపోనిష్ఠనుండఁగాఁ బార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షము.

పర—రాజా! నీతపశ్శక్తికి సంతసించితిమి. లెమ్ము. నీయభీష్టమేదియో తెలుపుము. నెరవేర్తు.

రాజు—దేవా! భవదీయపాదాశ్రితుఁడనై భోగభాగ్యంబులఁద్యజించి యీఘోరారణ్యంబున తపంబొనర్పవచ్చితి. నిన్నుశరణంటిని ఇంతియగాక తొలిజన్మంబునఁ గావించుకొనిన సుకృతంబున దేవరదర్శనంబు లభించుటచే ధన్యుఁడనైతిని. మహాత్మ! నాకోరిక యేముండును.

గీ. వంశమింతటితోడ వి । ధ్వంసమంద
కుండనొకపుత్రుఁదయ చేసి । యుండయను కృ
తార్థుఁజేయఁగదయ్య దే । వా! శివా! మ
హాప్రభో! దీనరక్ష కృ । పాంబురాసి.

పర—(తనలో) వీనియదృష్టమందు సంతతిలేదు. కానిమ్మిట్లని చూచెద (ప్రి) రాజా! చంద్రచూడా! సకలసద్గుణ యశోవిరాజితుడగు నల్పాయుష్మంతుఁడు గావలయునా! దీర్ఘాయుష్మంతుఁడగు మూర్ఖుండుగావలయునా!

రాజు—(తనలో) ఇదియేటివిషమపరీక్ష, నేనిమ్మహాత్మున కేమిసమాధాన మీయఁగలను? మితిలేని సంధిగ్ధావస్థయందుంటినే హరహరా! ఏమిగతి।

శా. ముందున్ బావియు వెన్క గోయియ యనీ । పుణ్యాత్ముతో సిప్పుడే
మందుర్ తోచదయెన్ మనంబునకు నా । హా! సద్గుణుండైనచో
నెంచాకన్ మనుఁనోదురాత్ముఁడగుచో । నేరీతివర్తించుననో
యిందెద్దానిని వేఁడుకొందు నకటా! । యిద్దేది మార్గంబగున్.

మార్గమున కేమున్నది, కులమునకు వాసిని వన్నెనుగూర్చు

వాని సర్ధింపవలయునేగాని మూర్ఖుండున్న నేమి! లేకున్న నేమి అట్టివానికనుటకన్న యిట్టివిధాననుంటయే మేలుగఁదోచుచున్నయది. (ప్రకాశముగా) దేవా! అల్పాయుష్మంతుఁడై ననూ అంగీకరింతును గాన సుగుణవంతునే యొసంగుము. మహాత్మా! నీసుని కనిపెట్టకుందువా!

పర—రాజా! నీవు నిక్కముగా దూరదృష్టిగలవాడవు. నీయభీష్టముఁనెరవేఱుగాక. నీకొమరుండు పదిరెండు దినంబులకన్న నెక్కువ జీవించనేరఁడు

రాజు—ఆశాహతుఁడను ఆశాహతుఁడనుచంద్రశేఖరా అజ్ఞుఁడనుమన్నింపుఁడు. పుట్టకపుట్టకఁ బుట్టిపురుడైనసాంతముగ దీఱకముందే మరణమా! ఎంతవైపరీత్యము. మహాత్మా! మేమంత దురదృష్టవంతులమా? ఇంత శ్రమపడి దేవరను గూర్చి తపంబానర్చి ఫలితమునుబొంది దాని ననుభవించుటకు నోచుకొనలేదా! మృత్యుంజయా! అన్నాతురుఁడై వచ్చిన వానికి విస్తరి నిండ నన్నంబుఁబెట్టి తిన ప్రారంభింపకపూర్వమే లాగుకొనుటయా! దీనదయాళూ! ఇంతముద్దుముచ్చటలఁ దీర్చుకొనుటకైనఁ దగినకాలముండనక్కఱలేదా? చిన్నికుమారుని జలిబిలి పలుకుల వీనులకింపుగా వినవక్కఱలేదా? చిరుగజ్జెలమ్రోతలాహ్లాదముగ వినుమఁబుత్రుఁడటునిటు వచ్చియు రాని తప్పటడుగు లిడుచుండఁగని ముచ్చటఁజెంద నక్కఱలేదా! వీను నావంశాంకూరమని యీనాతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని రాజసభయందుఁ బలువురికిఁ జూపుకొననక్కఱలేదా! ఉయ్యాలలోఁ బరుండి మారముజేయుచుండ దానదాసీగణము జోఁగొట్టుచు లాలిపాటలు బాడుచుండ నాలింపవలదా! పుట్టిన దినంబని పదిమంది

ముత్తైదువల బిలుచుకొని యింత పండుగ పబ్బము జేసు
కొని సుఖించు భాగ్యమూ బాలుని తల్లి కుండనక్కఱలేదా?
దయామయా! పరాత్పరా! ఎంత అన్యాయము చేయుచుం
డిరి. అనఁజాలనుగాని తండ్రీ! ఇదియేదియో విషమపరీక్షకై
పన్నినయెత్తనుకొందును. కానిచోఁ బదిరెండు దినములలో
నాయుర్దాయముదీఱు బాలుని మేమేమి చేసుకొనెదము.
సద్గుణయశోవిరాజితుఁడగువాఁడంటిరే. ఈ యల్పకాలమున
వాని సుగుణపుంజములఁ గని సంతోషించు భాగ్యమేది? కృ
పాళూ! ఆశ్రితావనుఁడవై యర్థికోటిని వ్యర్థపుచ్చనివాఁడ
వై, యిదియా నీవు చేసిన సహాయము. దేవా! ఇచ్చితివి.
కైకొంటిని. అనుభవింపఁదగిన గడువీయవైతివి. దీనపోషా
నిజమాలోచింపుము. పురుటి స్థలంబున కీకాలములోపు
గ పురుషులు పోవుటకే తగిన వీలుచిక్కదే! నేను—ఎంత
యో కాలమునుండి పుత్రుఁడో పుత్రుఁడోయని తపించిన
నేను సర్వభోగంబులఁ ద్యజించి యింతదనుకఁ బరమనిష్ఠా
గరిష్ఠుఁడనై దేవరపదాశ్రితుఁడనై తపంబొనర్చిన నేను
కన్నులఁ గరవుదీఱఁ జూచుకొననక్కఱలేదా? ఆశాంకురము
ను మొలిచీమొలవకమునుపే త్రుంచివేయుట ధర్మమా! ఇం
తకన్న నాకీపుత్రభిక్షఁ బెట్టకుండిన మేలుగదా?

గీ. ఆశకుఁ ఫలమొసఁగక । యునలె లేద
టన్న చింతయె లేకుండు । నయ్యయిపుడొ
ఆశగల్పించి మొదటనే । నాశనంబు
జేసి నన్నేడిపించుట । చెల్లునయ్య.

మహాప్రభూ! నిరపరాధినిసుమా!

ఉ. అంతటి భోగభాగ్యముల । యందుమునుంగుచు తేలుచున్ననా
స్వాంతమునందు నీదు మృదు । పాదములన్ భజియించుటందు ర

వ్వంతయు సేయు, లోపము భ । వత్కృపయే శరణంబటంచునే
నెంతుఁగాని యిట్టులొన । రించుట కెయ్యది హేతువో హరా?

నాదనామక్రియ—రూపకం.

వరమదయఁగర! నీ మృదు పదములకిదె శరణంటిని!
కరుణఁబూని నానంశాంకురము నిల్పఁగదయ్యా! హరా ॥ప॥
వనిలోఁబడి యెందాక తపము జేసితో యుందాకై!
ననుఁనుతుమన నిత్తువేనిఁగ నినంతనమందు దయ్యా ॥ప॥

(అని పదములపైఁ బడును)

పర—రాజా! ఇఁకేమి విపరీతమున్నది. కోరినరీతి. నిచ్చితి నేనొన
ర్చిన యన్యాయమేమియులేదే. దీర్ఘాయుష్మంతుఁడా! అల్పా
యుష్మంతుఁడా! నీవర్థించునదని ముందే ప్రశ్నించితిని కా
వలసిన దాని నర్థించి యభీష్ట మొడఁగూర్చికొని యిప్పుడిట్లు
విచారపడిన నేనేమిచేయఁ గలుగుదునో చెప్పుము. వరప్రదా
నమున కిన్నిమార్పులుండునా! దానికొక నియమములేదా!

రాజు—(పార్వతివైపుఁ దిరిగి) ఓ వరమపతివ్రతాశిరోమణీ! దాక్షా
యణీ! కష్టసుఖంబు లెఱింగిన త్రిలోకజనని వగు నీకైన నే
లఁగరుణ రాదు. తల్లీ!

గీ. రాజొకండు పుత్రార్థియై । ప్రాజ్యరాజ్య
సౌఖ్యములఁబాసి వనమందు । నలిపినిష్ట
తోడఁ తపమును భగ్నుఁడై । నాఁడటన్న
వాదు మోయుంగవలదె? యో । పార్వతమ్మ.

అమ్మా! భక్తుని కరుణించుము. కరుణించుము. కరుణించుము.
(అని పాదములపైఁ బడును)

పార్వ—రాజా! లెమ్ము. విచారింపకుము, నీకుమారుఁడు దీర్ఘాయు
ష్మంతుఁడయి సద్గుణాకరుఁడై వెలుఁగఁ గలఁడు లెమ్ము.

జంగ్లారాగం-తాళం-ఏక

ధన్యుఁడనైతినిగా - తల్లీ నీకృపన్ ॥ధ॥
కనులకఱవుదీ - అనుసుతుగను - భాగ్యమునిచ్చి ।
బ్రోచిన - గౌరవమందుట ॥ధ॥
వెతలుదీఱెనసద్గతి - కల్గెనునా - ను
దులగొనుచు సుతుగతి రక్షించుట ॥ధ॥

పర—(తనలో) పరమ పతివ్రతామణి యని తనను సంబోధించి నంతమాత్రముననే యీమె యుప్పొంగి కాఁబోలు యీభక్తి నిగరుణించినది. ఇఁకనీసాధ్వివాక్యముతప్పదు. కానిమ్ము. ఈ ప్రియురాలియాకూతమును గనిపెట్టుదుఁగాక (ప్రకాశముగా) పతిదేవతాతిలకమా! ఎన్నఁడును వినికనియెఱుంగని త్రోవఁద్రొక్కితి వేమి?

పార్వతి—దేవా! త్రిలోకాధినాథా! నాప్రణయమును మన్నింపవలయును మున్నొకప్పుడు కైలాస శిఖరమున మనమిరువురమును సుఖాసీనులమై సరససల్లాపములఁబొద్దు బుచ్చుచుఁ బాతివ్రత్యమాహాత్మ్యమునుఁగూర్చి యొనర్చినసంభాషణమును మరచితిరా?

పర—(తనలో ఆలోచించి) ఓహో! ఇదియా! యీమె యభిప్రాయము. అవురా! స్త్రీ లెంతపట్టుదలగలవారు! కానిమ్ము వినోదమును గొంతతడవు చూడవలసినదే. ఓ వీరపతివ్రతా!

గీ. సరససల్లాపములఁ బొద్దు । జరుపునపుడు
పెక్కుమాటలు దొరలుఁట । నిక్కవంబు
వాటినన్నింటిలక్ష్య భా । వమున నుంచి
పట్టుదల బట్టుటలు నీకు । భావ్యమగునె.

కావున నీపూనిక వీడుము.

పార్వ—నాథా! చేసిన బాసఁదప్పనగునా? కావునలోకమునకు స్త్రీ పాతివ్రత్యమాహాత్మ్యమును నిదర్శనపూర్వకముగాఁ జూపుటకుఁగాను తాము చంద్రచూడుని కొమరునిగా నుద్భవం బందుఁడు. నేను పాంచాలదేశాధీశుని కొమార్తెనుగా జన్మించెదను.

శివ—అన్నా! (తనలో) సరససల్లాపముంత చిక్కుదెచ్చి పెట్టినది. ఇఁక నిప్పుడేవిధముగఁ జూచినను తప్పుకొను తెఱవుగాన్పిం పదు. కానిమ్ము. (ప్రకాశముగా) సుందరీ! "ఏకక్రియాద్వ్యర్థకరీ" యనునట్లు నీపవిత్రచరిత్రంబు ముజ్జగంబులకు శుభ ప్రదంబయి యాచంద్రార్కము నెగడుఁగాక. మఱియు నీరా జోత్తమున కభీష్టసిద్ధియగుఁగాక.

పార్వ—రాజోత్తమా! నీవువిచారించనక్కఱలేదు. నీకుజనియించు తనయునకు పండ్రెండుదినంబుల ప్రాయము మించకుండఁ బదిరెండు వత్సరములవయస్సుఁగల కన్నియందెచ్చి వివాహ ముఁజేయుము. అట్లగునో నీకొమరుఁడు దీర్ఘాయుష్మంతుఁడ గును.

రాజు—(తనలోవిచారముతో) అహా! ఇప్పుడేమిచేయుదును!

గీ. పురుడుదీఱనిపసివాని । ముందునిలిపి
పదియురెండేండ్లప్రాయపు । బాలకెట్లు
పరిణయముసేయువాఁడనె । వ్వానికండ్ల
కారమునుగొట్టినేనిప్డు । కన్నెఁదెత్తు.

కానిమ్ము తెగుదనుక బిగించినకార్యము మొదలంటఁజెడఁగ లదు. ఇందులకే యొడంబడెదను. (ప్రకాశముగా) అమ్మా! అట్ల కావించుకొందును—

పర—రాజా! వేచివేచిచూచినట్టివాఁడె గెల్పొందెనన్నట్లు మహా
పతివ్రతాప్రతిజ్ఞ నీపాలనమూలోపకార మొనరించినది.
మేమిఁక కైలాసమున కేగెదము. నీవును నీపురంబునకుఁ జని
యిష్టసిద్ధిఁ బడయుము—

రాజు—చిత్తము. ఈమీసేవకుఁ డిదె ప్రణమిల్లుచున్నాఁడు.

పర—రాజా! నీకు శుభమగుఁగాక!

(పరమేశ్వరుఁడు సతీసహితుఁడై నిష్క్రమించును)

రాజు—ఈరాజదంపతుల మహాప్రసాదమున నాకిఁకఁదప్పక సుతు
డుకలుగును—కార్యాతురుఁడనై మనంబుస్వస్థతలేక కలుగ
బోవు శిశువునకసమాన వివాహముఁ జేసెదనని యొప్పుకొం
టినిగాని యిదియెట్లు సంభవమో దోపకున్నయది—(ఆలో
చించి) ఇచట వితర్కించిన నేమిలాభము. ప్రయత్నమొన
ర్పకఁదప్పదుగదా? అపరవాచస్పతి యనంబఱంగు సకలశా
స్త్రపారంగతుఁడమాత్యశేఖరుఁడు వీరసేనుఁడుగలఁడు వాని
యాధారమున, బుద్ధి బల ప్రయోగమున నాకోరికె నెరవే
ర్చుకొందును. కాననట్లొనర్తును. (నిష్క్రమణము.)

---

## తృతీయరంగము

[ప్రవేశము:—వీరసేనుఁడు]

ఆహా! పరాత్పరుని వింత చెయిదములనేమని వర్ణింపఁ
గలము? మాయొడయుఁడగు చంద్రచూడున కీద్వాదశదినాయుర్దా
యుబాలునొసంగుటేమి? ద్వాదశవర్ష కన్యను దెచ్చి పరిణయముఁ
గావించినచో నీబాలుఁడు చిరాయుష్మంతుఁడగునట. ఇప్పు డీదు
ర్ఘటంబగు కార్యము తేకు నాశిత్తిపై మోపె. ఏమి సేయుదు
చింతాక్రాంతస్వాంతులరగు మారాజదంపతుల నీకార్యమే నీడే

త్తునని చెప్పి యోదార్చి వచ్చితి. బుద్ధి బలముపై నాధారపడి యీ పాంచాల పురంబునకు వచ్చితి. కొమరుని సాయము కావలసి యుండునని వెంటఁగొనివచ్చితి. సకల సద్గుణమూర్తి యగు తనయునితో నింతవఱకేమియు యోచించనైతి. నాయత్నములాతనికి రుచించునో లేదో ఈపురాధీశునికడ పదిరెండు వత్సరంబుల కన్నె గల దనియుఁ దగినవరునికై యన్వేషించుచున్నారనియు వినిగదా యిచటకు వచ్చితిని. ఇఁక ముందు కర్తవ్యము (ఆలోచించి) ఇట్లొనర్చెదఁగాక. (అనుమానముగా) ఇదెట్లు చేయనగును?

మ॥ ఇతఁడే పెండ్లి కుమారుఁడంచు సుతునే । నేరీతి జూపింతు న
నృత దోషంబుగదా! సరే యనుచు నే । నీయత్నమున్ దెల్పి స
సమ్మతమున్ జూపునె సన్నుతీ యనఁడె దు । ర్మార్గంబౌనర్పంగ నీ
గతి బోధింతువె యంచు పుత్రుఁడెటులన్ । గావింతు నీకృత్యమున్

కొమరుఁడు చీవాటులఁబెట్టునని ప్రభుకార్యనిర్వహణంబున వెను కడుగిడుట మాత్రము ధర్మమగునా?

గీ. చిటికెవైచుచు నదియెంత । చేతు నిపుడె
యంచు నార్భాటముల నాచ । రించివచ్చి
యిపుడు వెనుకడుగిడు దేని । నాకతలను
యెత్తుకొని సల్వురందుఁ జ । రించగలనె?

సాధ్యమగునంతవరకు నీతిబలమునే యుపయోగపరచి కృతార్థుఁడ నయ్యెదఁగాక. (అటునిటుఁజూచి) అదుగో నాకొమరుఁడును కలును కొనుచున్నాఁడు. ఇఁక యత్నములను బయలు పరుపక తప్పదుగదా?

విజయ—(ప్రవేశము)

విక్రి—నాయనా! వెనుక దిగబడితివేమి?

విజయ—తండ్రీ! అశ్వము లలసినందున దానికి నీరంబు బెట్టి కొంత సేదఁదీర్చుకొన నిచ్చి వచ్చితి. అందుచే నాలస్యమైనది.

వీర—సరే, గాని పుత్రకా! ఇచట రవంతసేపు విశ్రమించి పిదపఁ బురములోనికిఁ బోదము.

విజయ—చిత్తము.

వీర—నాయనా! చూడు,

గీ. పొల్లుచేనింపఁబడు కుంచ । ములసమాను
లైన పుత్రులచే నవ్వఁ । డగును ధన్యుఁ
డవనిచేతను కీర్తి గ । డించుకొలము
గుణకరుండగు నొకఁడట్టి । కొడుకు చాలు.

సకల సుగుణయుతుండవగు నీకు నెక్కుడుగ వక్కాణింపఁబని లేదు. వినుము.

గీ. పరసతీయటన్న నన్ దల్లి । వలెను బరుల
ధనము చిల్లపెంకులవలె । దలచి ధర్మ
పురుషుఁ డితండను విఖ్యాతి । బడయు నెవఁడు?
వాఁడెగా సద్గుణుఁడన । బడెడు జగతి.

కుమారా! తన పుత్రుండెంతటి సుగుణాత్ముఁడైనను మఱియు మఱియు నీతులఁ గరపుచుండుట పితృధర్మంబగుట వేరు విధంబుగ దలంచకుందువుగాక.

విజయ—(తనలో) నాయనగారేలకో మఱల నీతులు నేర్పఁదొడఁగిరి. ఇప్పుడట్టి యవుసరమునకుఁ గారణము దురూహ్యముగ నున్నది. కానిమ్ము. తెలియకుండునా? (ప్రకాశముగా) తండ్రీ! తమ నీతుల శిరసావహించి యాచరణంబునం బెట్టుట మాకు విధాయకము. నిజమే. కాని యిప్పు

డిత్తలంబున నింతగా వర్ణించుటయే నాకాశ్చర్యము
కలిగించుచున్నది.

వీర—మరేమియు లేదు. నేనొండొక కార్యార్థినై నీసహాయము
గావలసి నిన్ను వెంటఁగొని యిచ్చటకు వచ్చితిని.

విజయు—ఓహో! నా సహాయమా? తండ్రీ! తమయాజ్ఞ నొసర్చ
నేను వెనుదీయుదునా?

గీ. ఎట్టి దుర్ఘట కార్యంబ । యేని నన్ను
యిక్కటులు ప్రాప్తమైన గా । నీ రవంత
యేని జంకక మీదు యా । జ్ఞానవర్తి
నగుచు దీర్పనే, యనుమాన । మందఁ దగునె?

వీర—కుమారా! మన ప్రభువగు చంద్రచూడునకుఁ బదిరెండు
దినంబులు మాత్ర మాయుర్దాయము గల కొమరుఁ డుద
యించె. వానికి పదిరెండు వత్సరంబుల ప్రాయంబు గల
కన్నని చ్చి వివాహమొనర్చినచోగాని యతఁడు చిరకాల
ము మననేరఁడఁట. ఈ పాంచాలపురాధిపతియగు సింహ
కేతుని కడ నట్టి కన్న గలదని విని నే నికార్యంబు సాధిం
తునని చెప్పి యారాజదంపతులఁ జింతనుండి యోదార్చి
వచ్చితి.

విజయు—ఇందుఁగల నా కార్యమేమి? తండ్రీ!

వీర—కుమారా! తొందరపడకుము. చెప్పెదను. ఆఁ రాకుమారునకు
మారుగా నీవా—రత్నమాల పడకటింటి కరుగవలయును.

విజయ—ఇదియెట్లుతండ్రీ—ఇప్పుడేగదా!

సీ. పలికినాఁడవుపర । భామినీసాంగత్య
మపత్రిష్టకు మూల । మగునటంచు
వినిపించితివి చిల్ల । పెంకురీతిని పర
ధనముఁ జూచుట యుక్త । ధర్మమనుచు

బోధించితివి నీతి । మూలంబుగాదు సూ
నృతముఁ ద్యజించు ప । ద్ధతియటంచు
వచియించితివి గౌర । వము, ఖ్యాతినిన్ దెచ్చు
తనయుఁడొక్కఁడెచాలు! । తనయ! యనుచు
ఇంతలోనీహితులవచి । యింతువేల!
పెండ్లికొమరుఁడనేనసూ । వెలఁదియగుచు
తులువనైన రత్నమాలతో । వలుకుటెటుల?
మోసమునఁబడకటింటికిఁ । బోవుటెటుల?

నాన్నగారూ! ధర్మబద్ధమై సకారణంబయిన కార్యమునకు నుపక్రమింపనగును గాని యిట్టి యకార్యమెట్లొనర్తును. జనకా! సకలార్థవేత్తలు నీతిశాస్త్రపారంగతులునగు తాము మాతృవంచక ములోఁజేరిన రాజపత్నినిఁ గలయుమనిచెప్పుట న్యాయమగునే?
వీరసే—(తనలో) సత్యముగ వీఁడు నాపుత్రుఁడే యగును. పరస్త్రీ
పరాఙ్ముఖుఁడు. ధర్మనిరతుఁడు. ఇకార్యంబునకుఁ దలయొగ్గ
డని యెరిగియే యుంటినికాని వీని నకార్యమునకుఁ బురిగొల్పు
టలేదే. (ప్రకాశముగా) బాలకా! నాయభిప్రాయమిఁకను
బూర్తిగ వెలువరించక మున్నే యిట్టులాడిననెట్లు.

చ. పలుకుటలేదునేనిపుడు । వంచనబుద్ధినిరాకుమారునిన్
గలయుమటంచునీవినయ । గౌరవసంపదనేనెఱింగియున్
పలుకగలాడనేయిటుల । బాలక! చెప్పెడిదెల్లవించునా
వలసిదిధర్మపద్ధతియె । పాతకకార్యమొచర్చఁజేయుమా.

శయనాగారమునఁజొచ్చిన తత్క్షణంబ రత్నమాల నిన్ను భర్తగా నమ్మి యెన్నియో శృంగారవిలాసములఁజూపును. అట్టి వలలలోఁ బడక నీప్రజ్ఞానైపుణ్యంబును జూపి యీరాజపుత్రిగర్భితమగు వ్యంచనంబచటఁ బెట్టినిల్లగఁ దప్పించుకొని రమ్ము. ఇదియ నీవుచేయ

దగిన కార్యము. ఇక్కార్యనిర్వహణంబున కొఱగులుపచరింపరు. ఎందు
చేనందువా?

మ. స్థిరబుద్ధిన్ జరియించు వారరుదు ధా । త్రిన్ యౌవనార్భాటముల్
  గరితల్ జూపిన తోడనే భ్రమసి లో । కంబేమిగా నెంతురో
  పరివారేముని యందురో యనెడు చ । ర్చన్ మాని వర్తింతు రి
  ద్ధరనమ్మన్ దొరకండొకండయిన పు । త్రా! యెంతయత్నించినన్.

కావుననే నిన్ను నియోగించితి.

విజయ— చిత్తము. అట్లయినఁ దప్పకనే నిక్కార్యంబు నిర్వహించి
  వత్తును.

వీర— కుమారా:—

మ. పరిహాసంబు లొనర్చి పెక్కుగతులన్ । భాషించి శృంగారచి
  త్తరువుల్ జూపు దురత్తరుల్ పులుముచో । య్యారంబులన్ జూపియె
  త్తరినైనన్ తమకోర్కులన్ దగ యకాం । తారత్నముల్ చేయు మం
  దురు మోసంబుఁ జలింపకుండనట నెం । తో స్థైర్యముల్ జూపుమా.

  ధర్మపరుండవు. ఎక్కువగాఁ జెప్పఁబనిలేదు. జాగరూకుఁడవై
మెలంగుము.

విజయ— వేయేల ?

మ. ఇదియే చేతిలోఁ జేయివైచెదను దం । డ్రీ! నీతిమార్గంబునున్
  వదలన్ రానుతఁ దల్లిపోలె మది సం । భావింతు నేమైన దు
  ష్పథమున్ ద్రొక్కన నీతిగాదనెడ దు । శ్చరిత్రయై పైకొనన్
  మది నింతేని చలింపఁగానట ధ । ర్మంబున్ బ్రతిష్టించెదన్.

వీర— మనమింకఁ బురములోనికిఁ బోవుదము. నిన్నొక్కచోనుండ
  నియమించి నేను సింహకేతుని యాస్థానమున కరిగెద.
  ఆవల కర్తవ్యమవ్వాని మఱల యోజించుకొందము.

విజయ— చిత్తము. (నిష్క్రమింతురు.)

# సంగీత చంద్రకాంత నాటకము

ద్వితీయాంకము—ప్రథమరంగము.

(ప్రదేశము. సింహకేతునిదర్బారు)

ప్రవేశము సింహకేతుఁడు దీర్ఘదర్శి.

సింహకే—మంత్రీ! దీర్ఘదర్శీ! నాప్రియపుత్రికరత్నమాలకుఁ బం డ్రెండువత్సరంబులు దాటిపోవు కాలము సమీపించినది. ఇంతవఱకును దగినవరుఁడు లభించకుండెను. ఆపాక్ష దినమే నుముహూర్తమునకుఁ దగినదని దైవజ్ఞులు బలుకుచు న్నారు. ఎట్లయినను సాధించి యీలగ్నమునకే కార్యము జరుపుదమను భ్రాంతిగలదు. నాకేమియుఁదోచకున్నయది. కర్తవ్యమూహించిన సంతసింతు.

సేవ—(ప్రవేశించి) మహారాజా? చందరిచూడ మహీపాలుని మంత్రియట. వీరసేనుల వారట. వచ్చి దేవర దర్శనార్థియై హజారముకడ నున్నవారు. ఆజ్ఞకు నిరీక్షించియున్నారు.

సింహ—అమాత్యశేఖరా! నీవెదురుగఁజని వారినిచ్చోటికిఁ దో డ్కొనిరమ్మి.

దీర్ఘ—చిత్తముఁ (వెళ్ళి వీరసేనునితోఁ బ్రవేశము)

సింహ—వీరసేనా! కూరుచుండుము.

వీర—(కూర్చుండును.)

సింహ—వీరసేనా! బంధు మిత్ర పరివార సహితముగ మీరాజు నకు క్షేమమే.

వీర—చిత్తము.

సింహ—మీరాకకుఁ గారణమెయ్యదిగా గుతూహల పడుచు న్నాఁడను.

వీర—రాజా! వేఱే కారణమేమున్నది. మామహీపాలుఁడు దేవర తో వియ్యమందఁగోరి నన్నుఁబుత్తెంచిన వచ్చితిని.

సింహ—(సంతోషమున) ఏమీ! మాప్రభువునకుఁ బుత్రరత్నము గలఁడా?

గీ. అవుర! అరచేత మాణిక్య । మమరియుండ
నాఱు నాడును వెదకుచు । నున్నవాఁడ
బండె నావంట చంద్రిమా । ఘుండువియ్య
మందెదన్న సంశయమేల । సందెదయ్య.

వీరసేనా! మీరాకుమారుని చిత్రపటంబును దెచ్చితివా?

వీర—ఆహా! తెచ్చితిని. రాజా! మఱియొకవిశేషముగూడదు.

గీ. ఎల్లి సుముహూర్తముండుట । నెటులనుండు
నోయనుచు వెంటగొనివచ్చి । యున్నవాఁడ
వానినే దేవ యిదెచిత్ర । పటముదీని
జూచి మిమ్ములగోరుచు । న్నాఁడనయ్య
(అని చిత్రపటమిచ్చును.)

సింహ—(పటమును దిలకించి ఆనందముతో) వీరసేనా! రాకుమా రునిఁగూడఁ దోడ్తెచ్చితివా? ఏమి నీచాతుర్యము నిన్నెంతైనఁ గొనియాడఁదగును గదా? (మఱలఁ బటమును జూచుచు) ఆహా! ఏమి యీసౌందర్యము. ఈసౌందర్యంబున కనుగుణ ముగనే సుగుణసంపత్తియు నుండవచ్చును. "యత్రాకృతి స్తత్రగుణాః" అనున్యాయము ననుసరించిన గుణరూపములకు ననపాయసాంగత్యము గదా! ఇఁక మారత్నమాల భాగ్య మెంతకైనఁ దగినదే! ఈబాలుని రామణీయకము రతి

రాజును గెలుచుచున్నది. ఈలేనగవుమొగంబు తొగ రాజును మించుచున్నది. నెన్నడుమున సింగంపు పిల్లలను బురడించుచుండె. కలువరేకులకీడైన కన్నుగవకలిగియున్న రాజులచెలువంబుఁ గలిగించు యీనురూపసద్గుణ యౌవనమును కల్గిన బాలుని గన్న చంద్రచూడుని భాగ్యమునకు సాటిగలదా! మంత్రివర్యా! వీరసేనా! ఇంక జాగేల? రేపటి దినసుముహూర్తమునకు మీయభిప్రాయమేమి?

వీర—(తనలో) నేను నీకన్న నెక్కుడు తొందరగనే యున్నాఁడను. (ప్రకాశముగ) రాజేంద్రా! కాకతాళీయ న్యాయముగ కార్యము సిద్ధమగు నపుడు నిర్ణయించిన లగ్నమును దప్పింప నేల? రేపటిలగ్నమే ప్రశస్తముగ నున్నటుల నాకును దోఁచుచున్నది. కాని నాదొక విన్నపముగలదు. మారాజుగారి వంశకులాచారము ననుసరించి కులదేవార్చన సంపుటమునకు వివాహమాచరించుట విధి. కాన మీరు దాని కొడంబడుదురని నాయాశయము.

సింహ—వీరసేనా? భావ్యభివృద్ధికి మూలమగు వంశాచార సంప్రదాయమును తప్పించుటకు నేనేమి అవ్యక్తుఁడనా? అట్లె గావింతము. మంత్రీ! దీర్ఘదర్శీ! వివాహసంభారములనెల్ల నాయత్తపఱచు సన్నాహంబున నుండుము.

దీర్ఘ—చిత్తము. [నిష్క్రమించును]

సింహ—వీరసేనా! రేపటి సుముహూర్తమునకు మీరును సిద్ధులరు గావలయు. నీవింక విడిదికరుగుము. నేనిఁకఁ బ్రయత్నమున నుండవలయును గదా?

వీర—భాగ్యము (తనలో) నాయత్నంబున సగంబు నెరవేరినది. మిగత సగము కూడ నేల నెరవేరకుండును. బుద్ధిబలమున సమకూరని కార్యముండునా?

సింహ—మన మింకఁ బోవుదము, రమ్ము. [నిష్క్రమింతురు]

ద్వితీయరంగము—ఉద్యానవనము.

(రత్నమాల చెలికత్తెలగు కనకవల్లి, కాంచనమాలతో బ్రవేశము)

రత్న— కీర్తన-చక్రవాకము-ఏక

వనిఁజూడ రారెయో వనితలారా మీరు॥ వ॥

ఘనతరశోభచే మనసులఁదనియించు॥ వ॥

మనకువలసినను మముతుగోసుకపోయి

జనసికినొసఁగి హర్షమునందఁజేత మీ॥ వ॥

చెలులు—అట్లనేసమ్మా (పూలుగోయుచుందురు)

కన—కాంచనమాలా! మనరత్నమాల స్వయముగానేరిన పుష్పములతోడనే గాత్యాయనిని బూజించవలసియున్నదని దేవేరిగారు సెలవిచ్చిరి కదా! అమ్మా! రత్నమాలా! ఈమాలతీలతికయందు మేలుపూలున్నవి. ఏరుమమ్మా!

కాంచ—కనకవల్లీ! తనకుదగినవరుని లభింపఁజేయుమని నిరంతరమా వుమాపతిని సేవించుచున్న మనరత్నమాలకును మనకును వేఱుగ రాణిగారి యానతియేల?

కన—ఓహో! మనరత్నమాల యాకూతమెట్లుండునో గ్రహింపఁగోరి కాఁబోలు యిట్లనుచున్నావు! వింతనెరజాణవే?

కాంచ—అవును. నేను నెరజాణనే. నీవుమాత్రము సత్యకాలపు దానవు.

గీ. మగఁడో మగఁడోయటంచు రే ॥ బగలుపలువ
రించు మనరత్నమాలను ॥ గాంచియింత
దనుక గుర్తింపలేకున్న ॥ దానినిన్నె
జూచితిని యింతమాత్రంబు ॥ దోచకున్నె

కన—ఏమి నీవుద్దుఁటు అంతమాత్రమునకే రత్నమాల యుడికిలు వనుకొంటివేమి! నీవేమగఁడని పలువరించనిదానవు.

కాంచ—నామాటకేమికాని మగడన్నవేమోయెఱుగక మదిగట్టుకొనియున్న దానవు నీవొక్కతవేగదా!

కన—ఓసి! టక్కులాడీ! మనకీ వాదప్రతివాదము లెందులకుగాని మనరత్నమాల యాకూత మట్టిదేయని యామెనోటఁ జెప్పించఁగలుగుదువా?

కాంచ—నేననిపించు టెందులకు. తెలివిగలదానవేని ప్రసంగముల వినుచుండరాదా! క్రమక్రమముగ తేటపడగలదు.

కన—(తనలో) ఇదియెంతకేనిఁ దగినదే దీనిగెల్చువారెవరు?

కాంచ—చెలీ! రత్నమాలా! ఈపొకగున్నను కన్నెమాలతీలతిక యెట్లు ప్రాకుచున్నదో చూడవమ్మా

రత్న—(తనలో) ఈచెలి తనమనంబునఁగల యాకూతమును మర్మపఱచుచు మాటలాడుచున్నయది. కానిమ్ము (ప్రకాశముగా) ఔను. ఈమాలతీ లత చాలయేపుగ బెఱిగినది గాన నే బాగుగాకొనసాగుచున్నది.

కనక—భర్తృదారికా! చూడుము!—

గీ. ఒక్కచోఁబుట్టి పెరుగుచు । నుండి తుదకు
చెలుల చామంతి కలమల్లి । కలను విడచి
మాలతీలత చెట్టెక్కి । మాటయైన
చెప్పకుండపోవగసాగె । చెలియ యదిగో

రత్న (తనలో) నాకుఁబరిణయంబై యత్తవారింటికిఁ బోవుకాలమున వీరితో జెప్పకుండఁబోదుమని నర్మగర్భితముగ నీ కనకవల్లిపలుకుచున్నది. (ప్రకాశముగా) సఖీ! బాగుగాపరికింపుము. నీవుపొరబడితివి.

గీ. వయసునందు సమంబౌట । ప్రాకుటందు
గూడసట్టులెనమదశ । గూడుచుండు

కలసివచ్చెడినో లేదో । తెలిసికొనక
తల కొనను వంచి చూచెను। తరుణియదిగో॥

కనక—కాంచనమాల! చూచితివా? ఎంత సరసముగ ప్రత్యుత్తర మిచ్చినదో!

రత్న—చెలులారా మీరేమో యనుకొనుచున్నారు. నేను వినరాదా! పరదానునా! నాకడనేనా మీదాపటకములు.

కాంచ—మతేమియులేదమ్మా

గీ. ఎల్లి నీకుమగండౌ ల । భించునాకు
సంత వలకేమి లేదని । యీలతాంగి
మనమునంగల యాకాంత । ముసు ననహ్య
భావమును వెలువరించెడి । ప్రాణసఖియ.

కన—(వ్రేలుత్రిప్పుచు గుటిలముగ గాంచనమాలను చూచును.)
రత్న—నాకేమి తెలియును? నీకే తెలియును. దూరముగనుండుము.

కాంచ—(నవ్వుచు) నాకిదివఱకే తెలిసినది. ఈలాటి ముగ్ధలకు మటికొంతలావు. రత్నమాలా! నెచ్చెలుల మొదల నీకింతసిగ్గేల? ఇన్నిదివసంబులకు శర్వాణి నీపైఁ బ్రసన్నురాలగుటకు మేమెంతయు సంతసించుచున్నాము. కాని చిన్ననాటనుండియుఁ గలిసిమెలసి యొక్కచోనున్నవారమగుటచే మాకు వియోగప్రాప్తి గలుగునే యని విచారపడుచున్నారము.

రత్న—సర్మసఖులారా! మీయిర్వురను విడచి యీరత్నమాల క్షణముండగలదా!

కనక—(జనాంతికముగా) కాంచనమాలా! వింటివా! ప్రియసఖ యెంత నేర్పుగా బలికినదో?

కాంచ—అందాశ్చర్యమేమున్నది? చూడు.

గీ. జననమును బట్టి ప్రాజ్ఞత । సంభవించు
నందు విద్యావతులకది । యబ్బురంబె?
యొలకదే యమృతము చంద్ర । కళనునుండి
యేమి కాశ్చర్యమందెద । వింతి నీవు.

సఖి! రత్నమాల! వేళ యతిక్రమించుచున్నయది. మన మీ ప్రస్తావనముతోడనే గడుపుచున్న నేమి ప్రయోజనమమ్మా?

రత్న—అవును. పువ్వుల నేరుదము. రండు.

(ఏరుచుందురు)

కాంచ—కనకవల్లీ! చూడుము. మన రత్నమాలను.

గీ. సారె సారెకు విటులపై । శరము వేయ
వంగి సాగుచు మదనుని । సింగిణియన
కుసుమముల మాటి మాటికి । గోయ వంగి
బడలి పరిపరిచిందునీ । పడతి యొప్పు.

కన—ఎట్లయినను నీవు ప్రౌఢవు గనుకనే యింత చక్కగా వర్ణించితివి

దాసి—(ప్రవేశించి) అమ్మా! రత్నమాలానతీ! నీకు మంగళాలంకారములు చేయుటకై సఖులతోఁగూడ గొనిరమ్మని రాణిగారి సెలవైనది.

చెలులు—సఖీ! (రత్నమాలను పిలుచుచు) రమ్మా. సజ్జులుగోయుట రాణిగారి సెలవైనది. రమ్మా. రమ్మా.

(అందరు నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

పాంచాలనగరము—పురోహితగృహము.

(నాగేశ్వరావుధానులు—ప్రవేశము.)

నాగే—ఛీ! ఛీ! పెండ్లికూతురి వారితరపు పౌరోహిత్యం అంతహీనం యింకోటి కనపడలేదు. డబ్బా? దస్కమా? పెండ్లికుమాగుని వైపు పౌరోహిత్యమంటే అంతామూటే! ఎవడొచ్చాడోగాని అదృష్టమంటే వాడిదే అదృష్టం. మారాజపుత్రి రత్నమాల కాకపోతే రత్నమాలుడు గారాదూ? యిల్లంతా నింపేద్దునుగా? ఆముండాకొడుక్కైనా రోగమన్నా రాలేదేం? రెండువైపులా పనికలిగేది? ఆముండాకొడుకు వచ్చాడని శిష్యుఁడు చెప్పనే చెప్పాడూ. వాడేమంత్రం చేవగలవాఁడో తెలియదు. వాడినోట్లో బెడ్డగొట్టి యింతలా ధంపాంచే సూత్రమేమిూకనబడలేదు. కానీ మంచి మిూద సాగకపోతుందేమో చూద్దాం? బసకొకసారి ఆపురోహితుని తీసుకురమ్మని శిష్యుణ్ణి పంపాను. ఇంకా రాలేదు. (అని చూచుచుండగా రామశాస్త్రిగారితో శిష్యుఁడు వచ్చును.)

రామ—కాంపిల్యా! ఇదే నాయిల్లు.

కాంపి—ఆఁ. ఆఁ. యిదే. అరుగో మిూకోసం ఎదురు చూస్తువున్నారు.

రామ—నానేత్రములకెనగో యున్నదని వారితో చెప్పి జాగ్రత్తగా కూర్చోబెట్టుకుమిూ?

నాగే—(తనలో) గుడ్డివాఁడా? కొంచెము పాచిక పారవచ్చును. వీనినెట్లయిన మోసపుచ్చి పెండ్లికట్నము నావాడిలో వేసుకోవచ్చును. (దగ్గఱకుఁబోయి) ఓమహానీయమూర్తీ? సింహా

కేతుని పౌరోహితుఁడు నాగేశ్వరశాస్త్రి యిదిగో నమస్కరిస్తూవున్నాడు.

రామ—యెంతమాట సెలవిచ్చారు. అయ్యో! యోగ్యులు వయస్సులో నేను కొంచెం పెద్దవాణ్నే మోకాని పండితులుమీరు మీకు ముందుగా నేను నమస్కరింపవలసినవాణ్ని.

నాగే—పెద్దలు మీరు అలా శెలవీయరాదు.

రామ—ఆఁ, పెద్ద. తాడిపెద్ద. ఏళ్ళుం టేసరియా? నాయనా! పెద్దవాణ్నే యింతదూరం రావలసివచ్చింది తప్పలేదు. ఏమో యింతవుంది. తినేవాళ్ళెవరు లేవలేక రాలేను మొట్టో అంటే యింకా నేజేసే కార్యాలేమున్నాయి. లేకలేక తపస్సు ధారపోస్తే యీకాస్తనలుసూ పుట్టాడు రావయ్యా! పెద్దవాడవు నీవు లేకుండా పెళ్ళేమిటంటే! యేవ్వూరురాజుగారితో పనియేలాబోయి యేలావస్తుందో? అని అట్లాగే యీమ్చు కుంటూ వచ్చాను.

నాగే—ఏమో! పెద్దలు. మీకుకావాలి నేనంటే పిల్లలు నేను పదిమందిమి బతకాలి. కుక్కదానము గ్రహించి యైనా కుటుంబసంరక్షణ చేసుకోవాలి. నేను తమకు శిష్యుణ్ని. పుత్రతుల్యుఁడను. ఇన్నాళ్ళకు మీయట్టిపెద్దల సాంగత్యంచిక్కడం వుండే అదేపదివేలు. జన్మ పవిత్రమైంది. కులమూ గోత్రము పావనమైంది. నాపూర్వుల తపస్సు పండింది గనుకనే నేడు మీదర్శనం ప్రాప్తమైంది. ఒక్కమనవి. వేరే బనఎందుకు చేశారు? నేను పరాయవాణ్నా తమకు. శిష్యుఁడి పరిచర్య అంగీకరించి యీనాలుగు దినాలు మాయింటనే యేదో మాతోపాటు గంగామృతం పుచ్చుకుంటే సంతోషిస్తాను.

రామ—(తనలో) పాపము వినయముగల ముండాకొడుకల్లేనే వు న్నాడు. ఈవచ్చే బియ్యం పప్పు వుప్పూ కూరలు ఎవరు మోసుకు పోతారు. ఉన్నది తింటేచాలు. అదీ యిదీ వీడే నిర్వాకం చేసుకుంటే బాగావుంటును. లేవలేక నేను బాధపడడమన్నా తప్పుతుంది. నాకు మాత్రం తినేవా రెవరున్నారు, పాపం. పిల్లలుగలవాడింతతింటాడు. (ప్రకా శముగా) శాస్త్రిగారు! మీరంటే నాకు పుత్రవాత్సల్యము. చక్కగా కుదిరింది యీవివాహము. రెండువైపులా మీరే వుండి ఆకట్నాలు ఆకానుకలు మీరేస్వీకరించి నాయనా! కుటుంబపోషణ చేసుకో. నేను నిమిత్త మాత్రంగా వుం టాను.

నాగే—(తనలో) నాచేయి టక్కు లక్కులకు వచ్చినవి. ముండా కొడుకు వలలోపడ్డాడు. (ప్ర) గురువర్యా! తమరు పెద్దలు. తమకువలసిన యుపచారములు నేను నాశిష్యులూ లోపమే మీ లేకుండా చేసికిరిస్తాం. తమరింక లోపలికి దయచేసి రవంత సేపు విశ్రమించండి.

రామ—ఇంత గౌరవము చేయాలా! నాయనా! ఇదిమట్టుకు నా యిలుగాదూ! నాకు పరాయిలెవరు?

నాగే—మీకు గురుదక్షిణ యేమిమ్మంటారు?

రామ—నాకు, దోడుగానుండి యీకార్యం మాటదక్కించి ఆ రావలసినవి వదక్కని నీవనుభవించడమే నాగురుదక్షిణ.

నాగే—తమరు నిమిత్తమాత్రముందురూ! నాతడాఖాచూపిస్తాను.

రామ—(తనలో) వార్ధక్యము వచ్చినప్పటినుండి ముక్కాముటాగ్రి మరచిపోయా! ఎక్కడేమి పొరపాట్లొస్తాయో! యిక్కడి పెద్దలేం ముక్కట్టుకుంటారో అనే భయంతో చచ్చిపో

యాను. ఇప్పుడా బాధపోయింది. నాపాలిటి దేవుడల్లే
దొరికాడు వీడు. సాధారణంగా పౌరోహిత్యాలలో అయిక
మత్యాలు సూన్యమే గాని నాపూర్వపుణ్యము బాగానేవుం
ది. (ప్రి) నాయనా! నీశక్తి నేనప్పుడే తెల్సుకున్నాను.

నాగే—(తనలో) శక్తి కనుక్కొన్నా నంటున్నాడు. నానాటకము
తెల్సుకున్నాడా యేమిటి? కొంపతీసి?

రామ—శుభలగ్న మాసన్నమైనది. నీవుముందుగా రాజగృహమునకు
వెళ్ళుము. నేను సమయానికి వచ్చికూర్చుంటాను. ఒకప్పుడు
వచ్చినా రాకపోయినా రాని లోపము లేకుండా సర్దుకో
నాయనా.

నాగే—(తనలో) పుచ్చకాయ దొంగలాగు నానీడజూముకొని నేనే
భయపడ్డాను. వీడువట్టి పిచ్చముండా కొడుకు. కావలసిన
పనియై పోయింది. తమాషగాయిట్లా అంటా. (ప్రకాశముగా)
గురూత్తమా! మీకు నేను గురుదక్షిణ సమర్పించు కోవడా
నికి బదులు ఆకట్నాలన్నీ నన్నే పుచ్చుకో మంటున్నారు.
అట్లా సెలవీయవచ్చునా! కానిండు. గురుప్రసాదమును బరి
హరించుట మహా దోషమన్నారు పెద్దలు. ఇంక మనము కాలో
చితకృత్యాలు తీర్చుకుందామా?

రామ—అందులకభ్యంతరమా నాయనా? లే. పోదాం.

నాగే—అరేశిష్యా!

శిష్య—ఏమి సెలవు.

నాగే—వీరినిజాగ్రత్తగా కాపాడుతూ ఉపచారాలు చేయాలినుమా!

శిష్య—ఓ. చిత్తము. కాని గురూత్తమా! ఒకమనవి. నాలుగేం
డ్లయింది వచ్చి. వారాలభోజనాలు చేయడం మీకు గడ్డి
తేవడం కూరగాయలమళ్ళు వేయడం పత్తితెచ్చిపెట్టడం

కొల్లాయిలుఁ వుతకడం యింతేనా నాబ్రతుకు. ఇప్పటికి సం ధ్యావందనమన్నా పూర్తిచేశారా. దీనికేం గాని యుండి. దర్భపోటులు తగిలితే భోజనం నావంతు. డబ్బులు మీకిచ్చు కోవడమునా!

నాగే—ఏమేఁ నస్తావు పదరా! పెద్దపెళ్ళిగదా. వినాయకపూజ కొల్లా యన్నా యివ్వనటరా! సరేగాని సంస్కారులు వగయిరాలు వస్తారు. వాళ్ళను ముందు మనవద్దకు లాక్కురా! చిఠా పద్దులో వ్రాయించి రసీదులు గుంజాలి.

శిష్య—అదంతా నాకెందుకు. పొదుఁ డబ్బు లిస్తూవుందురూ! గుడి మింగిమంటే గుళ్ళో లింగాన్ని కూడా మింగుతాను.

నాగే—సరేలే. పోదాం రండి. (అందఱు నిష్క్రమింతురు)



# సంగీత చంద్రకాంత నాటకము

## తృతీయాంకము

(రాజపుత్ర గర్భితమగు మంజూషను చేఁగొని విజయసేనుఁడు శయనాగారమునందుఁ బ్రవేశించి స్వగతము)

మ. మనమా చంచలబుద్ధివీడుమునుమా। మాంద్యమ్ముఁబోఁద్రోలుమా
వనితారత్నము మాతృదేవి యను భా। వంబందె నీవుండుమా!
గణనాతీతములైన క్లేశములతోఁ। గాట్లాడఁగాఁ బోకుమా?
ఘనతా పెద్దల పేరునిల్పఁదగు వి। ఖ్యాతిన్ బ్రతిష్ఠింపుమా!

మ. జనవంద్యుండగు తండ్రి యాజ్ఞ యిది నీ। చంబో ఘనంబో
గను ధర్మంబును తప్పఁజాల రాజుమా। ర్గంబెన్నఁగన్ వీడ స
ద్గుణ సంపాదన కేశమున్ బడెద నా। శోఁ బోరఁ బోకమ్మ యో
మనమా! చంచలబుద్ధివీడుమునుమా!। మాంద్యమ్ముపోఁద్రోలుమా!

మ. వనితల్ చిత్రవిచిత్ర రీతులు మనో। భావంబులన్ దెల్పి కా
మునకున్ దానుని చేయఁజూతురట యే। మోయెట్టివన్నాగముల్
గననున్నాఁడనో యేమిమూఁడునో కటా!। లక్ష్యమ్ము నోనుండి యో
మనమా! చంచలబుద్ధివీడుమునుమా!। మాంద్యమ్ముపోఁద్రోలుమా!

మ. అనుమానింపకు రత్నమాలనిను న। న్యాయంబుగా మోసగిం
పను నుంకించెనుపట్టునందు బ్రికటిం। పన్ ధర్మమున్ నీతిగా
దనుమా! సత్పథగామివై తూ నటుప్ర। బోధంబున్ బ్రయోగింపుమా
మనమా! చంచలబుద్ధివీడుమునుమా!। మాంద్యమ్ముపోఁద్రోలుమా!

(అటునిటుఁజూచి లేచి)

మ. అనుకొన్నంతనె వచ్చుచున్నదదుగో। యుజ్జ్వాక్షి! యీ మేన్కనుం
గొను నంతన్ జెమటౌసు నాకడుపు జం। కున్గొంకు లేకుండ నే

మని భాషింతును, మెట్లు గాంతు ముఖమెట్లాలింతు నీసోదెనో
మనమా! చంచలబుద్ధివీనుముసుమా! ॥ మాంద్యమ్ముఁబోద్రోలుమా!

మ. నను నాధాయని పిల్చుటల్ నిజము నేనా! నాధుఁడన్! నేనుగా
ననినిక్కంబు వచించినన్ వినుని నానారీతులన్ శోధచే,
యను నుంకింపదె యీతలోదరి కటా !! ప్రాప్తించె నీపాపమో
మనమా! చంచలబుద్ధివీనుముసుమా! ॥ మాంద్యమ్ముఁబోద్రోలుమా!

ఓహో! ఏమి యీసాధ్వి సురూప సంపద. ఎంతటియైన పొగడదగును గదా! కవు లేమేమో యిట్టిపట్టున నతిశయోక్తులచేత తమ పాండిత్యప్రభావముచేత సర్వాంగములను చిత్రవిచిత్రములుగా వర్ణింతురుగాని మాతృపంచకములో నొకటియై బఱగు నీయుత్తమాంగనను అందునను నీరాకుమారిని నేను నానోట నేమని వర్ణింపఁగలను! కర్తవ్యమున దొరకొని యిత్తంబునుండి తప్పించుకొని మార్గంబును చూడవలయుఁ గాని కొదువవిషయములతో నాకేటి పని! చందురుని మించు కాంతిగల మొగంబే కానిమ్ము. కలువ రేకుల మించు కన్నుగవయే గలిగియుండ వచ్చును. రాయంచ నడకల మించు నడకయే యుండవచ్చును. ఒయ్యారముగ నడువ వచ్చును. ఓర చూపులఁ జూడవచ్చును. ఇవన్నియు నాకు లెక్కయా! ఇట్టి వర్ణనమునకే దొరకొని నాయమూల్య కాలమును వ్యర్థ పుచ్చుకొనుచుఁ గూరుచుండిన మనంబునకు బుద్ధి చెప్పకొన నాతరంబగునా! శృతి మించనేల! రాగమునఁబడనేల? కానియొక్కటి మాత్రము గలదు మోసము. ఇందుకుఁ గర్తను నేనా? సకల ధర్మ శాస్త్ర పారంగతులగు తండ్రిగారంకటి, యకార్యమునకుఁ బురిఁగొల్పుదురా? ఒకవేళ అట్లనే యగుచో అంతటి మహాత్ముల యాజ్ఞనాఁదల ధరించి నేను చేయఁదగినదే. పితృ

వాక్య, పరిపాలనమవశ్య, కర్తవ్యమని శ్రీరాముని, చరిత్ర, వేనోళ్ల, జాటుచున్నది. కానిమ్ము. కాంతామణి వచ్చుచున్నది.

రత్నమాల—(ప్రవేశము) అద్దిరా! నేడెంత సుదినము? నానోము లన్నియు నేడు ఫలోన్ముఖమునకు వచ్చినవి. వసంత జయంత నిశాకాంతరతికాంతుల మించు జగన్మోహనాకారుండగు నాప్రాణకాంతుఁడీ హంసతూలికాతల్పసమీపమున నిలుచుండి నారాకకై కాఁబోలు నిరీక్షించుచున్నారు. నేనప్పుడే తొందరపడనేల? ఇచ్చోనిలువబడి మనోనాయకుని యాకూతమును గ్రహింతుఁగాక (అనితలుపు ప్రక్క నిలువఁబడును)

విజ—(తనలో)

గీ. పావకజ్వాలలను బోలు । పడఁతులరయ!
మానవులదైనచంచల । మానసంబు,
వెన్నముద్దకు నీడు గా । వింపవచ్చుఁ
గాని యగ్నినిగని వెన్న । కరుగకున్నె.

ఇప్పుడీకాంతామణితో నేమని చెప్పిపోదును. ఏమని సంబోధింపవలయు. కానిమ్ము. ఈకాంతామణి యేమని పలుకరించునో చూచెదఁగాక—

రత్న—(తనలో) ఈనవమోహనాంగుని యాకారముఁ జూడఁజూడ మొదట ననురాగమును బిదప విచారమును గన్పట్టుచున్నది. కారణంబేదియో దోపకున్నయది. ఏలకో క్రీగంటమాత్రము చూచి మఱల తలవంచుకొనియెను.

గీ. కేలు తనకేల గీలింప । కేలనిటుల
నిలుపఁబడియెను నేనెట్లు । పలుకరింతు
నెదురు రారయ్యె నాదగు । హృదయమునకు
ముదమునున్ గూర్పరయ్యె యే । మో! గతంబు.

గీ. నిలువ కన్నది మోహంబు । వలుకరింతు
మన్న సిగ్గు వెన్కకు లాగు । చున్నదకట!
మనసుఁడదయుండగుచు నను । మాటిమాటి
కిట్లు వేధించుచున్నాఁడి । కేమిసేతు!

అక్కటా! ఎంతవఱకును తలయెత్తి నావంకఁజూడడయ్యె. ముందుగఁ బలుకరించుట కులకాంతల ధర్మముగాదు? ఏమి సేయుదును. (ఆలోచించి) కాదుకాదు. ఇది నాతప్పిదమే! నిజముగ నేనే నా భర్తగారి కాగ్రహము కలిగించితిని.

గీ. ముందుగావచ్చియుండి నే । నిందునిలచి
భర్తరాక నిరీక్షింప । వలదె నేను?
తడవుమసలి యిప్పుడువచ్చి । తగుదునంచు
మూతి బిగియించు కొనిన నా । చేతమేమి!

కాన—

గీ. ఇంకనేని తప్పులసహి । యించినన్ను
రక్షణము సేయఁడని ప్రా । ర్థన మొనర్ప
దగును నాభర్తగారిని । దానికన్న!
గలదె! యుత్తమ మార్గంబు । దలఁచిచూడ.

(ప్రకాశముగా) ప్రాణేశ్వరా! దానురాలి యాలస్యమునకు మన్నింతురు గాక!

విజ—(తనలో) అనుకొన్నటులనే సంబోధించినది. ఏమందును, (ప్ర) కులపాలికాతిలకమా! సకలసద్గుణయుక్తోపేత యగు రత్నమాల యాలస్యమును మన్నింప నేనెంతవాఁడ. అట్లనరాదు.

రత్న—(తనలో) అయ్యో! ఇదియేమి విపరీతప్రత్యుత్తరము. అందులోఁ దలయెత్తకుండగనేనా! ఇంతకన్న వేఱువంచనము గావలయునా యుత్తమకులకాంతకు!

పరిహాసముగా) ఆర్యా! నేనొనర్చు యుపచారంబులంగీకరించి నా యొనర్చిన జాగును మన్నింపవేడుకొందును. మాప్రియ కాంతామణిపై నింత యాగ్రహమూనుటధర్మమా!

విజయ—(తనలో) ఈసాధ్వి యిట్లు పలుకుచున్న దేమిసేయుదును. మానసమా! కళవళ పడకుము. (పరిహాసముగా) ఏలినసాని నాకునీమీాందయలుక యేమి? ఆపెట్టెను పూజించుకొనుము.

రత్న—(దీనవదనయై) ఆర్యా! యేల యిట్లు వాకొనుచున్నారు. శరణార్థినులకుదయతావునరక్షణము లేదా!

విజయ—కులకాంతాసతీ! కుల సతులుకుల దేవార్చన సలుపుట ధర్మముగాదా!

రత్న—దేవా! అవును. పతికన్న దైవమెక్కడే?

క. పతియే సతికిల గతియని
శృతులును స్మృతులున్ వచింప ? చెవిఁజేర్పవె? యీ
గతి వెత నేటికి మున్రంతురు
సతిపై దయరాదెయింత ? చలమేటి ప్రియా.

విజయ—సాధ్వీమణీ—నీవు చెప్పినది వాస్తవమే కాని నావలుకు లాలించి యీామందసంబున భద్రిగతినున్న చంద్రచూడుని తనయుని పూజించు కొమ్ము.

రత్న—దేవా! పతియాజ్ఞ మీాఱుటదోసంబగుటచే నట్లనేయొనర్చెద. (అనిపెట్టెనుబూజించి)ఆర్యపుత్రా! మీాయాజ్ఞ నిర్వర్తించితిని. ఇకనైన మీాదాసు రాలి యెడఁబ్రిసన్నులగుగండు

విజయ—రత్నమాలా! ఏలతొందర పడియెదవు! తొనపడిన ప్రయోజనము కార్యభంగమని యెఱుంగవా!

రత్న—నాథా! మరుఁడు నిర్దయుండై విరిశరంబుల బిరబిర యురంబున గుప్పుచుండ నోర్చుట దుర్భరంబని తమకుఁదెలియదో!

విజయ—తరుణీరత్నమా! ఇప్పుడే మారునిశరంబుల నెదుర్కొన
జాలనివారము ముందు కాలుండు మనలఁ బ్రచండ దండబా
ధలచేర్పొట్టఁ బెట్టుచుండ నెటుల తాళఁగల్గుదుము. త్వరపడకు
ము. ఈసుఖంబులు తృణప్రాయంబులు. ఈరూపంబులతిదీర్ఘ
కాలంబుండునవి కావు. తనువుల శాశ్వతములని భావించి యీ
తుచ్ఛసుఖంబులకు నన్నింకఁ బ్రోత్సహించకుండువు గాక!

రత్న—మనోహరా! పరిహాసంబులకై మీరిటులఁ బలుకుచుండిరా
మనోవాక్కాయకర్మంబులఁ గోరివరించి జయించి గాఢ
మగు దమిచే నిక్కఱణి పరిపరి తెఱంగుల వేడుకొనుచున్న
మీప్రియకాంతామణి మీపద సమీపమున నిలుచుండి వేడు
కొనుచుండ సమయమునకుఁ దగని వేదాంతోపన్యాసమున
నిరాదరభావమును జూపుట భావ్యమగునా! ఈ లేప్రా
యంబున మనకట్టి వైరాగ్యము కలుగుట కెక్కడైన సం
దుగలదా? ప్రపంచికమంతయు నిట్టి వైరాగ్యముచేతనే
నిండియున్నచో యీతనువు లెందులకు? ఈరూపములెం
దులకు? ఈభోగభాగ్యము లెందులకు? పరమాత్మ కంతటి
బుద్ధిలేకనే వీటి నిర్మాణమునకుఁ దొరకొనెనా! ఎంతగా
నర్థించుచున్నను, ఎంత వినయపూర్వకముగ సంబోధించినను
తలయే మెత్తి మీ చరణదాసి మోమైన విలోకింపరైరి.
ఇది నాప్రారబ్ధముగాక నేమిగాదలంతును?

విజయ—సాధ్వీ! ఏల నన్నీకార్యమునకుఁ బురిఁ గొల్పెదవు. నీయభీ
ష్టమీడేర్ప నాచేతము సమ్మతింపకున్నయది.

రత్న—భార్యను సుఖపెట్టుట అకార్యకరణీయమా? చేతము సమ్మ
తింపదా! ఎంతయో వేదాంతోపన్యాస మొనంగిన మీకిది

ధర్మముగఁ దోచెనా? భార్యతోడి పొత్తు మీపట్ల నధర్మ
ముగఁ దోచినదికాఁబోలు.

విజయ—నిజముగ నట్లునే దోఁచినది.

రత్న—ఎందువలన.

విజయ—నేను నీపతిని కాకపోవుటచేత.

రత్న—మీరు నాకు పతిగారా? లోకమును మాయుదురా? ఇం
తయేల?

గీ. మీరె నాపతియంచు న । మ్మించి నాకు
పెండిలిని సేయ గమనించు । చుండినట్టి
సాక్షులగు లోకసాక్షులు । శశియు సూర్యు
డష్ట దిక్పాలకులు తార । లరయ లేరె.
ఇంతలోనే నిట్టి యబద్ధములా! దేవా! అనరాదుగాని—

గీ. క్షత్రియ కులోద్భవులుగద । సత్యరియతి
దప్పి యీగతి నచియింప । ధర్మమగునె?
పరిహసింపరె యీగతి । నొరులు వినిన
వాద మాడిన నిలుతునే । వాయియెత్తి.

విజయ—కాంతామణీ! నాహితోపదేశము నీకు రుచింపకున్నయది
నీవాక్యముల మూలముగనే నావాక్యములు ధర్మబద్ధము
లనిపించుదునా? చూఁడు. పతియేగతి సతికిలనంటివిగదా.

రత్న—అవును.

విజ—నేను నిజముగ నీ పెనిమిటిని గాను. నమ్ముము. ఈమందనం
బున గల రాకొమరుఁడు నీపతి. ఈతఁడే చంద్రిమాకుని
తనయుండు నిన్ను వీనికే కట్టఁబెట్టిరి. తొలుదొల్త నీ దేవ
తార్చనానంపుటికి వివాహము గావించిరాలేదా?

రత్న—దేవతార్చనాసంపుటికి వివాహము గావించిన మాట వాస్త వమే కాని యది వంశాచార సాంప్రదాయమని బలికి యిట్లు గావించిరి గదా?

విజ—నీవు నీపతివ్రతా ధర్మమును నిలఁబెట్టు కొనఁ దలఁచినచో నానచియించిన రీతిని చేయుము.

రత్న—ఏమందురు. ఈ పెట్టెలోనున్న దేవుఁడు నాభర్త యందురా? దేవతార్చనా సంపుటిలో నుండునది భగవంతుఁడే. నిజమే! భగవంతు నారాధించు దానను నేనొక్కతె నేనా? లోక మంతయు పూజింపదా? ఆతఁడు నాకేపతి యననేల! సకల లోకములకుఁ బతి సకల మానవులకు పతి. సకల దేవతలకుఁ బతి.

విజ—కాంతామణీ! ఏల నాయమూల్య కాలమును వృథావాదము చేఁబాకు చేతువు. నీవు నాకు భార్యవు గావన్న వినవేమి ప్రారబ్ధము. నీపెనిమిటి యీపెట్టె యందుఁగలఁడు. పూజించు కొమ్ము. పూజించు కొమ్ము. నీకు శుభ మగును. మార్గ ల్య మునిని సేవించి యాతని భార్య తరించిన విధంబున ధన్యురాల వగుము.

రత్న—(తనలో) ఇది యంతయు విపరీతముగ నున్నదే. నా మనం బీతని యందే గదా లగ్నమై యున్నది. ఏమి చేయుదును. ఈ సౌందర్య శాలి యీమందసమును నిక్కడకుఁ గూడ గొనివచ్చె. తొలుత నీమంజూషకే పరిణయముఁ గావించిరి. అయినను యిట్లొని చూచెదను. (ప్ర) ఆర్యపుత్రా!

సీ. రోగిష్ఠుఁడౌ మగని ♦ బతిగాంచి ♦ భోగములను
విడచి యాసాధ్వి పతిని సే ♦ వించెమున్ను

సత్య సంపన్న సౌందర్య । సహితు మిమ్ము
భర్త గాఁ బొంది గాసిల్ల । వలెనె నేను?

విజ—నీ ప్రత్యుత్తరంబులకు మాఱుపలుకుట నాకు దుస్సాధ్యముగ నున్నయది. స్త్రీలు చంచల స్వభావులు. పయోముఖ విష కుంభములు. మాయా స్వభావులు. కఠిన హృదయు లనుచు నేమేమో కవులు వర్ణించుటలు గాంచి యనృత మను కొంటిని గాని యిప్పుడు స్వానుభవంబున నన్నియుఁ జక్కఁగ తేటపడుచుండుటచే సూనృతంబులే యని యొక్కొక్కటి దృఢపరచుకొను చుంటిని. నన్నింతటఁ బోనిమ్ము. నీకుఁ బదివేల వందనములు—

రత్న—

గీ. ఎన్ని జెప్పిన వాటికి । నెల్ల మీరు
మాకు జెప్పుచు బ్రనతి । మాడ్కి నన్న
రోసి నాయును రేలకో । బోసికొందు
రకట మీరలు మంకులా? । యటులఁబలుక.

విజయ—వనితా రత్నమా! నీకిది తగదో తగదో, యని గోలెత్తుచుండ నన్నేల నిందా వాక్యములచే నొప్పింప జూతువు? ఒక్కమాట నాలింపుము.

కం. వని యెంతియొ యున్నట్టుల
ననయము నిటు నటును తిరుగు । వ్యర్థము గాఁగన్
శునకపు గతి నీపాపపు
మనసనగా సిగ్గు లేని । మర్కటము గదా.

మహాత్ములు చెప్పిన వాక్యము లనైన స్మరణకుఁ దెచ్చుకొన వలదా? ఉత్తమ కాంతల చారిత్రములనైన నుదాహరణముగఁ గైకొని బుద్ధి నిల్పుకొనవలదా? ఇంత దనుక నేచేసిన హితోప

దేశం బంతయు వ్యర్థపుచ్చి మీాదు మిక్కిలి నిందించుటయా ?

గీ. అంటి నీభర్త కానని, ǀ యంటినాదు,
కలఁడు నీనాథుఁడని, యంటి ǀ తులువపథము
నీవు త్రొక్కిన దని, యంటి ǀ నీతి కాద
టంచు, నంటి నీపెట్టి పూ ǀ జించుమనుచు,
నంటి పదివేల వందనా ǀ లనుచు, నంటి
తగదు తగదంచుఁ గాని, నీ ǀ తలపు తలఁచె
చేసి యేమేమొ యిటుల ǀ భాషింపుచుంటి
వౌర యేమందు నీదగు ǀ యాగడంబు.

రత్న—(తనలో) నేనెన్ని విధంబుల సిగ్గును త్యజించి లోఁబడి నుడి
విసను నీతని మనంబు కరుగకున్న యది. నేనింకేమి సేయు
దాన ? హా ! విధీ! యెంత పనిఁ జేసితివి ? నిట్టి బాధలను
ముంపు చుంటివి (నిట్టూర్పుతో) కానిమ్ము ! ఇంకను య
త్నించిచూచెదను (ప్ర) మనోహరా !—

గీ. ముసలి వానికి వైరాగ్య ǀ మును వహింపఁ
దగును సంపూర్ణ యౌవన ǀ ధారుతైన
మీాకు యీానుద్దు లేటికి ǀ రాకుమార
మానుఁడీ ! యింకపై నిట్టి ǀ మాటలెల్ల.

విజయ—ఇఁక నేను మారాడఁ దలఁచు కొనలేదు. నీయిచ్ఛ రీతిని
వాకొనఁ దగును. నేనింక బోయెదను. సెలవిమ్ము—

రత్న—ఇఁకఁ దెగువగా మారాడెదను. (ప్ర)

గీ. గోముఖ వ్యాఘ్రి మట్టుల ǀ గుట్టుకుండ
ముగ్ధనై నట్టి నన్నిట్లు ǀ మోసపుచ్చి

పెండ్లి గావించు కునినీవు । పెడ తలంపు
బెట్టితిని బుద్ధి పెడతల । బట్టెనోకొ.

విజ—(శిరమెత్తకయే) నేను సేవకుగ నింక నీతలంపే మార్చు
కొనక మాటుం జెప్ప కుంటివి-ధర్మమా:—

రత్న—ఇట్టిమోసమున కొడిగట్టుట నీకు ధర్మమా!

విజ—ధర్మమో అధర్మమో! సకల దేవతలు గలరు. సూర్య చం
ద్రులు గలరు. నేను మాటలాడి నంత వఱకసత్యము లేదు.
నీపతి నిజముగా నీపెట్టెయాదు భద్రమై యున్నవాఁడు.
చూచుకొమ్ము. నాపై నేల నీకీమరులు. నన్ను దూషించి
తివని షండుడ నంటివని భయపడి నీతిని వర్జించి పాపభీతి
విడిచి నీమోహాకు లకులోంకు వాఁడను గాను. నీవింక నీ
యాశ వదలుము. పాతివ్రత్య మాహాత్మ్య మెఱింగిన నీవు
యుత్తమ కాంతల మార్గంబ నుసరింపుము.

రత్న—నేను నమ్మఁ జాలను. మనోహరా! నీవే నామనోహరుఁ
డవు. రమ్ము. కౌఁగిలిమ్ము. తమి దీఱ నొక్క ముద్దు పెట్టు
కొన నిమ్ము! మనమిరువుర మేకమైనచో నామదనుని పదన
శరములఁ దృటిలోనఁ బటాపంచలు గావించఁ గలను. జాగు
సేయకుము. నన్నివిధి గాసిఁబెట్టుట యుక్తము గాదు. నా
యునురు నీవనుభవింతువు. నామాట వినుము. జనకాదులు
కులకాంతలఁ గలియు లేదా? మునీంద్రులు సహితము
కాముబాఱికి లోనుగా లేదా? అట్టి వారికే లేని యాముడలు
మనకేల! ఈవేదాంతము లేల! మన్మథా వస్థనుండుటచే
నున్మత్తనై యాడిన మాటలకుఁ గినియకుము. (దగ్గరకు రా
బోవును.)

విజ—కాంతారత్నమా! ఆగుమాగుము. నాకు చదువుఁ జెప్పుచు
దగ్గఱకు వచ్చుచుంటివా?

గీ. తుణిక మైనట్టి సంభోగ । సౌఖ్యమెంతొ
ఘనతగా నెంచి నామాట । గట్టిపెట్టి
చేయు చున్నావు విపరీత । చెయ్దములను
నిన్ను నేముట్టు కొనఁదల్లి । నీరజాక్షి
పెట్టిలో నున్న నా దేవు । డొట్టునుమ్ము.

దూరము గఁదొలఁగుము:—

రత్న—హా! కఠినాత్మా! ఎంత పని చేసితివి! హా! దైవమా.
(మూర్ఛిల్లును)

విజ—కటకటా! ఎంత పాపాత్ముఁడనైతిని. పటు తరంబులగు నా
మాటలచేఁ గుటిలకుంతల చటులంబగు విరహా నలంబున
కోర్వజాలక మూర్ఛిల్లినది. ఆహా! ఎంతమోసము!

గీ. అల వసంతుని సమయము । సందుమిగులఁ
గోమలంబుగఁ బెఱిగి లే । కొమ్మగ్రీష్మ
కాల మందునఁ బాడుచు । నేలమీఁద
గూలు పోలిక నీకొమ్మ । పూల విలుతు
వాడి కోరువఁజాలక । వ్రాలె ధరణి.

నేనిత్తా వునుండి తరలుట కిదియే యదను. లేక నీయువ తేచిన
గార్యహాని యగును. (కొంతనడచి) ఆహా! నిజోచితాచారము నే
మఱచి పోవు చుంటిని. (పేటి కకు నమస్కరించి రత్నమాల పాద
ములకు మొ్రక్కుచు)

శా. తల్లీ! నేను నటించిరిటి బ్రియుని చం । దంబిచ్చుటన్ గానవా
వల్లన్ గల్గిన నేరముల్ మఱచి పోఁ । బార్థింతునాప్రల్లదా

లెల్లన్ శోధనఁ జేసి శిక్ష విడ లేదే। పైనదేవుండు నీ
వల్లన్ గూడను కల్గె నేని భరియిం। పన్ గల్గదే రెంటికిన్.
(అనిలేచి వెళ్ళుచు)

క. ధరణియుఁ బుష్కరమును హరి
హరులును దిక్పాలకులును। యనవరతంబీ
నర వర దంపతు లకు సా
దరణము జూపించి యిచ్చు। తన్సద్గతులన్.

(నిష్క్రమించును)

రత్న—(మూర్ఛనుండి తేరి లేచి చూచి) ఔరా! కఠినుఁడై జాలి మాలి నేలపై వ్రాలిన నన్నొంటరిగ విడచి యేగెనుగా! ఎంతజాతి గుండె. ఎక్కడ కేగెనో! ఇందే తనైన డాగెనా! చూచెదఁ గాక (చూచి) ఇందెందును నామనోహరుని జాడ గానరాదే!

గీ. నాథ! నను వీడి యెటకేగి। నాడవర్ధ
నారిసిన్ భరియింపఁగ। దారిలేక
పారి పోతివా? లేక కో। పంబె యధిక
మాట చిరచిర లాడుచు। నరిగినావె!

గీ. నేరమేమి యెఱుంగని। నీ రమణిని!
అర్ధ రాతిరి విడనాడి। యడుగిమీను
పదములెట్లాడెనో ప్రాణ। వల్లభా! భ
రింపరానట్టి వేదనన్। ముంపఁదగునె!

ఓదయామయా! పరాత్పరా! నాకీదురవస్థ యెట్లుతప్పు. నాకిఁక దిక్కేది. ఆర్తావనదీక్షా పరతంత్రుఁడవగు నీవే నాకు గతి. ఇంక నామనోనాథుని సుందరవదనారవింద మవలోకించు భాగ్యము నాకు లేదా! ఓశరణాగత రక్షణబిరుదాంకా! ఆర్తనై విలపించు నాకు దిక్కగుము. నాప్రాణనాథుని

నాకన్నులఁ బడఁజేయుము. నాకీవిపద్దశఁ దొలఁగింపుము.
నా ప్రాణవల్లభుని కరుణామయునిఁ జేయుము. ఈతేఁ బ్రి
యమున ఇచ్ఛవచ్చినటుల సకల భోగంబు లనుభవించఁ
దగిన యీ యౌవనకాలమున వేదాంతోపన్యాసకుని జేసి
నాయెడ నింత కాఠిన్యునిఁ జేయుట ధర్మముగాదు. పరా
త్పరా! నిన్ను మ్రొక్కువారు నిన్నుఁ బూజించువారు నీ
భక్తకోటి యిట్టి విపన్నులగుచుండ నీవూరకుండుట పాడి
గాదు. దయాకరా! నేను నీభక్తురాలను. ఉత్తమకులో
ద్భవుని సుందరాంగుని సద్గుణసంపన్నుని నామనోహరుని
గా నొనర్పుమని నిన్నటిదనుక భజించిన దాననే నిన్ను
సేవించినదాననే. నీపైఁ బాటలఁ బాడిన దాననే. కలలో
నేని నిన్ను మఱచి యెఱుఁగక నహర్నిశలు నీపాదార్చన
ము గావించిన నన్నే నా యీవిధి గాసిల్లఁ జేయుట. (పెట్టె
వంకఁజూచి) అయ్యో! తన ప్రాణసమానంబుగ విభువరుఁ
చెంతనుంచుకొనిన యీపేటిక నిచ్చటనే వదలివెళ్ళిరిగా!
కానిమ్ము. యీసంపుటియం దేమో కలదనికదా వచించిరి.
తెఱచి చూచెదఁగాక. (పెట్టె దెరచిచూచి) ఆహా! యిది
యేమి వింత. ముద్దులు మూటఁగట్టుచు నిందొక బాలుఁ
డున్నవాఁడు. (ఆశ్చర్యముతో) గాలి చొరుటకైన సందు
లేని యీచందుగాయందు కందర్పసుందరుండగు యీబా
లుండిటుల బ్రతికియుండుట యబ్బురము కాదే! ఈ శిశు
విందుండుటకుఁ గారణమేమై యుండునో గదా! (బాలుని
పైకిఁ దీయుచు) ఒక్క పొత్తికగుడ్డయు నొక్క కాగితము
మాత్రమే యీశిశువున కాధారమా? ఇందేమియో అక్ష
రము లున్నవి. చూచెద. (కాగితముఁజూచి) శ్రీమద్రాజా

ధిరాజ చంద్రచూడ మహారాజ తనూభవుఁడును చంద్ర
కాంతి నామాంకితుఁడగు నీబాలుఁడు (ఆశ్చర్యముతో)
ఆహా! యేమి యీశిశుఁడా చంద్రచూడ మహారాజపుత్రుఁడు!
తనువాక చదివెదను. శర్వాణి శాసనమనుసరించి దీర్ఘా
యుష్మంతుని జేయుటకొఱకు పది రెండేడుల వయ
స్సుఁగల నిచ్చిచ్చి పది రెండు దినంబుల ప్రాయము
మించకుండ వీనికిఁ బరిణయము గావింపఁబడినది.
కానవో రత్నమాలా! యీనీ భర్తకు నిండు జవ్వనము ప్రా
ప్తించు దనుకఁ బోషించుకుని పిమ్మట నీతనితో యిచ్ఛా
నుసారంబుగ భోగంబుల ననుభవించుము. అహా! ఎంత మోస
మొనరింపఁ బడినది. ఈ శిశువు అల్పాయుష్మంతుఁడై చం
ద్రచూడుని పుత్రుఁడై జన్మించ నేల? చంద్రచూడుని
మంత్రి తనపుత్రుని చిత్రకు వంపి మోసగించ నేల? ఈమో
సమును గ్రహింపక నాతండ్రీ యీ పెట్టెకుఁ బెండ్లి చేయనేల!
ఈవిజయసేనుఁ డీమందసమును నాముందుఁ బెట్టి పోనేల!
ఓరా! విధి నిర్మాణ మెన్ని విపరీతముల చేయించినది. ఇ
ప్పుడేదిదారి? ఈశిశువును పోషించు తెఱవేది? ఇంక నేను
తల యెత్తుకుని నలువురలో నేమని మెలఁగుదును? చెలికత్తె
లతో నేమని చెప్పుకొందును! నా జన్మమింత నిరర్థకమై
పోవునని కలలో నైనఁ దలంప నైతినే? పరమేశ్వరా! ఎంత
పనిచేసితి వయ్యా! నీవిషమ పరీక్షకు నేనా దొరికినది? ఎంత
యేడ్చిన నేమిలాభము. ఈనాయార్తి నాలింపఁ బరాత్పరుఁ
డు గాక శరణ్యు మెవ్వరు? ఇఁక నే నిత్తావున నిలువఁ జాల!
నిలువఁజాల. నిర్జనంబగు వనంబున కరిగెద. (శిశువు నెత్తి
కొని పోఁబోవుచు) హా! హా! ఎంతగతి సంప్రాప్త మైనది.

గీ. పాలు పాలో యటంచు నీ । బాలుఁడేడ్వ
నేగతిని నూరడింతు నా । కేదిదిక్కు
ఏమి యిడి పోరు మాన్పెద । నేవిధాన
వీని రక్షింపఁ గలిగెడి । దాననేను.

నొసట బ్రహ్మ గీసిన గీతలు దాట నాకు శక్యమగునా? అయ్యో పాతివ్రత్య ధర్మ నియమములు దప్ప రాదుగదా! ఆ విజయసేనుఁడే నా నిజ భర్త యనుకొని సిగ్గు విడిచి, పాప భయంబు లేక నిజము కనుఁగొన లేక నేనేమి యో ప్రేలితిని. ఎంతయో దూషించితిని. ఉన్మత్తనై పోతిని! అంత విపరీతము గలదా!

గీ. పాప మాతండు చెప్పి నీ । భర్తయిందు
భద్రగతి నున్న వాడంచు । వానినుడులు
పాటి సేయక దూరితి । నోటవచ్చి
నట్లుగా కట్టిపడు వదే । యిట్టితప్పు.

పురాకృత దుష్కృతం బిటులఁ బరిణమించినపు డనుభవించుట కంటెఁ గర్తవ్య మేమున్నది. ఈ శిశువునే యాధారముగఁ గొని పరాత్పరుని సంస్మరించుకొనుచు నడవులఁ బట్టి పోయెద. ఇంతకన్న తెరవేదియు లేదుగదా అయ్యో! పదములు సాగకున్న యవి. అవును ఎట్లుసాగును.

సీ. కనిపెంచి పెద్ద దానిని జేసి యనిశంబు
గని పెట్టి నట్టి నా జ । నని బాసి
అంకపీఠిని నిల్పి । యతిప్రేమ శిరము మూ
ర్కొనుచు మన్ననఁ జేయుఁ । జనకుఁ బాసి
ఆట పాటల యందు । నహిశంబు నాకెంతో
వేడుకంబుఁ గూర్చునె । చ్చెలుల బాసి

ముల్లోకముల నేరు । బొంది యెరుంగని
గణనీయమైన భో । గములఁ బాసి!
పోవఁ గాళ్ళెటు లాడును । పోవకున్న
నాకు దిక్కెది? రావరే । లోకపాలు
లార! మీరలే మాకు ఆ । ధారులగుదు
రంచు నమ్మితి సోదర । న్యాయముల నిలువ.

(నిష్క్రమించును.)

ద్వితీయరంగము.

సింహకేతునిదర్బారు.

సింహ—ఓయీ! అమాత్యశేఖరా! గత రాత్రి యంతయు దుస్వ ప్నముల తోడనే గడుపనయ్యె. కారణార్థ మెటుల జరుగ నున్నదో యనుభయమునచే మనం బంతయు నాందోళనా పూరితమై యున్నది.

దీర్ఘ—కలలు కల్లలు. వీటికై విచారింప వలయునా? దేవా! కలలను నవి పలురకంబులుగ కలుగుచుండును.

సింహ—అట్లయినచో స్వప్నశాస్త్రం బబద్ధమందువా? ఏది యెట్లయినను దుస్స్వప్నపరిహారార్థమై కొన్ని దానము లిప్పింపుము.

సేవ—(ప్రవేశించి) మహారాజా! దేవర దర్శనార్థమై నారదులవారు వచ్చియున్నారు.

సింహ—(తనలో) ఈ కలహాభోక్త రాకయే నా దుస్స్వప్నముల ఫలితంబునకు బీజమా? (ప్రకాశముగా) దీర్ఘదర్శీ! సగౌర వంబుగ నెదుర్కొని వారిని తోడితెమ్ము!

దీర్ఘ—భాగ్యము (అని వెళ్ళి మునితోడఁ బ్రవేశము)

సింహా—సుర మహర్షీ! సురాసుర నికర మకుట మణిగణ ప్రభా విరాజిత చరణారవిందుఁడును, శాత్రవదనింహుఁడును నగు సింహకేతుఁడు నమస్కరించుచున్నాఁడు.

నార—(తనలో) ఓహో! ఈనర్తంచరున కెంత పొగరున్నది. ఈతని వాగాడంబరమే మదీయ కార్యసిద్ధిని సూచించుచున్నది. కాన నిట్లాశీర్వదింతును. (ప్ర) శీఘ్రమేవ శాత్రవ జయీభవ.

సింహా—దేవా! కూర్చుండుఁడు.

నార—(కూర్చుండును)

సింహా—దేవా! తమ యాశీర్వాదము పరమాశ్చర్యమును గల్గించుచున్నది. ముల్లోకంబులందును సింహకేతునకుఁ గూడ శాత్రవులుండిరే. అంతటి భూరిపరాక్రములుండిన నాకెరుగకుండునా? కాదా తామటు లాశీర్వదించవలసినది.

నార—ఓయి వెఱ్ఱివాఁడా! నీకింకను తెలియదా వినుము(అని చెవిలో నేమియో చెప్పును.)

సింహా—(మహోగ్రహముతో) ఓరీ! వంచకుఁడా! చంద్రచూడా! ఎంత ఘోర కృత్యము గావించితివిరా! కానిమ్ము. నిన్ను నీవంశమును నాశమొనర్పకున్న నేనింక సింహకేతుఁడనా! (కరుణతో) హా! తల్లీ! రత్నమాలా! నీ కెంతటి విపద్దశ వచ్చినదే అమ్మా! శిరీషకుసుమపేశల చారు శరీరము దుష్టజంతుభూయిష్టంబగు నిర్జనారణ్యంబునం గృశించుచుండెనో! ఓకుమారీ! రత్నమాలా!

సీ. కనఁగ వలసెనె నీవు । వని నాకు నేమాల
పద్రసోపేత భో । జనము వీడి
వినఁగ నయ్యెనె? నీవు । ఘనజంతుని నదంబు
చిలుక వల్కుల కల్కి । చెవులతోడి

ఉండ నయ్యెనె శైట । వెంఠలో మాడుచు
అంతి పుగాలకే । నలయుమేను
పండ నయ్యెనె పూది । నాటి రానేలపై
పూసెజ్జపై నిద్ర । పోవు నీవు
కటకటా ఎంతదు రవస్థ । కలిగె నమ్మ
గినుల-నో పురల సిన్నెప్పు । గాంతునమ్మ
ధైర్య మెటు దాల్తునమ్మ ఆ । దైవగతికి
నెంత దుఃఖంతు । నెటుల జీవింతునమ్మ.

నార—రాజేశ్వరా! మహాశూరుండవై ముజ్జగంబుల నీకు లేరని విఖ్యాతిఁ బొందిన నీవేనా! ప్రాకృతుని వలె విలపించెదవు! ధైర్యమవలంబించి కర్తవ్య మూహింపుము. అత్యాదియే శూరుల లక్షణ మని నీ వెఱుంగవా?

సింహా—ఓ మౌని చంద్రమా! అట్లయిన వినుఁడు!

మ. ఘనమద్బాహుపరాక్రమార్భటిని మత్తా్కరాగృహం బందునా
జననాథా ధమునిల్చెదన్ కుమ నా । శంకా నటుల్ జేసెదన్
అనిలో సాయము వచ్చువారి । యమలోకావాసులై యుందునో
ముని వంశోత్తమ! పంపెదన్ గనుఁడి నా । భూరిప్రతాపోన్నతిన్.

నార—(తనలో) వచ్చిన పని తొందరగనే నెర వేరినది. (ప్ర) రాజా! సందేహమూ! నీవు తలంచు కొనిన విజయమున కేమి కొఱఁత. కాల మతిక్రమించు చున్నది. నేనింకఁ బోయెద.

సింహా—నమస్కరించెద?

నార—అభీష్టావాప్తిరస్తు.

శ్లో॥ మాకురు ధనజన యౌవన గర్వం
హరతి నిమేషా త్కాల స్సర్వం

మాయా మయమిద మఖిలం హిత్వా

బ్రహ్మ పదం త్వం ప్రవిశ విదిత్వా ॥భజగోవిందం॥

(నిష్క్రమించుచున్నాఁడు)

సింహ—తత్క్షణంబ నాదుష్ట చిత్తుని సతీ సమేతముగఁ గొని వచ్చి కారాబద్ధుం జేయవలసి యున్నది కాన మంత్రీ! దీర్ఘదర్శీ! వలయు బలంబుల నాయుధంబుల, సంసిద్ధపరపుగుని మన సేనాని కాజ్ఞనొసంగెద. నేనును బోయి ప్రయాణ సన్నాహమున నుందును.

దీర్ఘ—మహా ప్రసాదము. దేవా.

(అందఱు నిష్క్రమింతురు)

3 రంగము.

(చంద్రచూడుఁడు మంత్రి సహితముగాఁ బ్రవేశము)

చంద్ర—వీరసేనా! చారు లేమి చెప్పిరి.

వీర—సింహకేతుండు నారదుని మూలమున మన కపటకృత్య మాలించి మండిపడుచు మనపై దండెత్తి వచ్చుచున్నాఁడని దెల్పిరి.

చంద్ర—మన సేనలు సిద్ధమై యున్నవా?

వీర—దేవా! ఇంత సేపా! ఎప్పటికేని యిది తప్పదని యిదివఱకే సిద్ధపరిపించితిని.

చంద్ర—మంత్రీ!

గీ. ఎంత కాలంబు సాధ్వస । హేతు వబ్బ
దంత కాలంబు భయమున । కడరవలయు
భయము కలిగిన పిమ్మట । భయము విడచి
యుచిత పద్ధతి వర్తింప । నొప్పుఁగాదె.

(తెఱలో)

ఓరోరీ! మహాపాతక వర్తీ! మోసకారీ! ఇంకఁ దుఱుకాడువులే.

మ. అతి సౌఖ్యస్థితి నున్న నానుతను దుష్టా! మోసమ్మున్ జేసియా
గతి ఘోరాటవి పాలు జేయుదువె మూర్ఖా! నిన్ను చేకత్తితో
గుతుకంబుల్ దెగఁగోసి యామిషము కాకుల్ కుక్కలున్ మెక్కఁ జే
సితినన్ పేరు వహింపనే? కులవు వానిన్ నిప్పునే? తుచ్ఛుఁడా.

(అనుచుఁ బ్రవేశించి, తిరుగ నదే పద్యమును చదువవలెను)

ఓరీ! పాపాత్మా! ఎంత పనిచేసి దుఱుకాడుచుంటివి?

చంద్రి—ఎంత చేసితిని. నాకోమరునకు నీకూతునకుఁ బెండిలిఁ జేసితిని.

సింహ—అదియేనా! నీవు కావించినది. కాలానలా? చూచెద వేమి ఈ దురాత్ముని ముందు బంధింపుము.

(కాలానలుఁడకస్మాత్తుగ బంధించును)

చంద్రి—వీరసేనా! నన్ను వీరు నేమఱుపాటుగ గదా బంధించిరి. కాఁగలది కాకమానదు. ఏమి చేయుదు. (అనిసంజ్ఞ చేయుచున్నాఁడు. వీరసేనుఁడు నిష్క్రమించును)

సింహ—కాలానలా! నీవు వీనిగైకొని నడుచుచుండుము. నేనిప్పుడే పోయి వీని భార్యను బంధించి మనచారులకు నప్పగించి వత్తును.

కాలా—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

## చతుర్థరంగము.

(కారాగారము చంద్రచూడుఁడు భార్యాసమేతుఁడై ప్రవేశము)

రాజు—సతీమణీ!

సీ. ముద్దైన తీరక । ముందె శిశువును ఘోర
విపినంబు పాలుగా । వించినాఁడ
నెండ కన్నులుఁగని । యింతిని కోడలిఁ
దుద. లేని యిడుమలఁ । ద్రోసినాఁడ
ప్రాజ్యమే సకల సా । మ్రాజ్యంబు గోల్పడి
బంధనా లయమందు । బరగి నాఁడ
ధర్మశ్రీ హార్శ్శ్రీ త్రమ । భాగములం దుండు।
మచ్చె కంటిరో వెంట । తెచ్చినాఁడ

గీ. ముక్తికై యాశ పడకనా । శక్తి వడితి
పుత్రి నిమ్మంచు శివుని తో । మోసగతిని
సింహ కేతుని సుతఁ బెండ్లి । చేయనేల!
విధి కృతంబును వేఱుగా । వింపఁ గలనె!

చంద్రి—ప్రాణేశ్వరా!

గీ. వింత కాలంబు దుఃఖంచె । నేనిగలదె
మన కులాభము ఎట్టులె । ననుకుమార
వదన మండలమును జూచు । పథమెఱింగి
నడువగా వలె నో ప్రాణ! । నాధమనము.

చంద్రి—జీవితేశ్వరి! ఎంత వెఱ్ఱివానవు. మంద భాగ్యులమైన మన
కింక నాయాశ గూడనా!

గీ. బ్రహ్మ వ్రాసిన వ్రాత గో । రంతయేని
దాట శక్యమె మనకు నో । తలిరుబోడి

గాన నామరణాంతము । గాక మనకు
దీని నెట్లైనఁ గుడువక । దీరదబల.

చంద్రి—ప్రాణ నాయకా! మనము తప్పించుకొనుట కొక యు
పాయంబు గలదు. వినుండు. ఐదేండ్ల ప్రాయము గలకన్నియ
నై పుట్టింట నున్నప్పుడు మాగృహంబునకు చాతుర్మాస్య
ము నెరపు కొననొక యోగీంద్రుఁడు వచ్చె. ఆతని పరిచర్య
కై మాతల్లి దండ్రులు నన్ను నియోగింప నేనాతని మనం
బున కుల్లాసము గలుగు నటుల నతి వినయభక్తి ప్రపత్తుల
తోఁ బూజింప నానందించి "అమ్మాయీ! నీ కెప్పుడేని యా
పద సంభవించి నను నన్ను స్మరించు నంతలో నీ కాయాప
ద వాయు" నని వరం బొసంగె. ఆతని యానతి గీతి సంస్మ
రించిన యీ కారాగార ద్వారంబు విడివడెను. కాన మన
మీ యర్ధరాత్రి నేగికిఁ దెలియకుండఁ దపోవనంబునఁ జేరి
మౌనివృత్తిఁ జరించుదము.

చంద్రి—(తనలో) కులసతులన సామాన్యలా? ఎంత గొప్పయుక్తి!

గీ. ఇడుమ లందు ధైర్యంబిచ్చు । నిహపరముల
మంచి చేకూర్పఁ బతిని సే । వించు మంచి
మార్గముఁ జూపు నన్నింట । మానవతుల
తెలివి తేటల వర్ణింపఁ । గలరె నరులు?

(ప్రకాశముగా) దేవీ! నీయుక్తి యుక్తి యుక్తముగ నున్నది. అ
టులనే మన మమ్మాహాత్ముని నారాధించి ధన్యుల మగుదుము.
చూడుము.

గీ. తమిద యంబలి తినుటకు । విమలవదన
దేహమునకు నల్లుల బాధ । తెల్లవార్లు

నిద్ర లేదిట్టి చోట । నెగడుకంటె
మాసి వృత్తి కానను నుండ । బూనఁదగదె?
గీ. రాత్రిఁ బవలును యీవహా । రాకులొంగి
మసలు టకుఁ దావు లేక నీ । మాడ్కి బంది
యుఁదు నుంట కన్నను గాన । నాకునలము
గుడుచు చుండుట మేల్కాదా । ఘోరవనుల.

దేవి! అటులనే కావింతము.

(తెఱవాలును)



# సంగీతచంద్రకాంతనాటకము

## చతుర్థాంకము.

### నిర్జనారణ్యము.

(ప్రవేశము రత్నమాల శిశువునెత్తుకొని)

ఆహా! దైవమాయ! అశేష భోగ భాగ్యములఁ బాసి యీ నిర్జనా రణ్యమున యీ శిశువుతో నింతటి దురవస్థ లనుభవించుచు నీగతి నవదనై విలపించుదు నని ఇట్టు లసహాయనై యేకాకి గనుందు నని స్వప్నంబున నేనిఁ దలంచు కొంటినా? జ్యోతిష్కులు ధనాశా వేశులై భావి దుర్దశల మాటు పరచి యీబిడ సర్వకాలంబు లందు సకలైశ్వర్యముల ననుభవించుచు సుఖంబుండు నని వక్కాణించు చుండెడివారే. పూర్వ పరజ్ఞానము లలవరించి తన తుల్యుగ నొనరించు దయామయుఁడీ జ్యోతిష్కుల నిట్టి యనృత వాదులుగ నేలఁ జేయవలెను. ఇట్టి అసత్యవాదుల కేనా! యిట్టి మొగమోటస్థుల కేనా దైవజ్ఞులని దైవజ్ఞశిఖామణులని బిరుదావళులఁ దగిలించు చుందురు. ఔరా! కాల మెంత వైపరీత్య దశ యుందున్నది?

గీ. మోస మెల్లెడ నిండెఁ; గా । పురమెయయ్యెఁ
దుచ్ఛులకు సాధువుల పైని । స్వేచ్ఛఁ గోడి
దాడి వెడలుట పెంపయ్యె । దయవినాశ
మయ్యె శాంతంబు నసియించె । నవనియందు.

ఈ శిశువు యీనా భర్త నాపోషణములో నీ నిర్జనా రణ్యములో నీక్రూర మృగసంకుల భయద స్థలంబునఁ బెరిగి నాకింత యాధారభూతులై నపుడు గదా! ఇది యంతయు నావెఱ్ఱి తలంపే

గాని! నా కట్టి సౌఖ్యము గలదా! ఇఁక ముందట్టి కష్టముల మునప నుండనో! పరాత్పరుఁడు! ఓ! సదా శివమూర్తి!

గీ. తగిన భర్త నొసంగి యీ । తనువుధన్య
మే నటులఁ జేయు మని సదా । ధ్యానములను
సలిపి నందుకు వేదన । వలను లేక!
నిచ్చితివి యిట్టి ఫలితంబు । మెచ్చుకొంటి.

గీ. అబలలను; యంతిపురముల । యందు మెలగు
వనితలను; యెండకన్నెఱు । గనిలతాంగు
లను; మహా శోధ జేయుటం । దు నగలట్టి
నీ తెలివి తేటలే మండు । నీలకంఠ.

గీ. ఎంతయో సుఖమును బొందు । నిట్టితరుణ
మందు శిశువును భర్తగాఁ । బొందు పఱచి
నాకు వార్ధక్య మబ్బిన । నాటనుండి
పతి సుఖము పొందఁ జేయుట । పత్నిగాదె.

గీ. దాడి విడలవే ఫాలనే । త్రిమును విప్పి
నరసతుల మోసగించితి । వారిపైనఁ
కపట వృత్తుల దరిగెకి । బలులపైన
సాధువులబట్టి హింసించు । జనులపైన.
వారితో గల్తు నాయన్న । భయమునగద
దేవదేవా యటంచు ప్రా । ర్థించు భక్తు
లందు శత్రుత్వ మూని న్యా । యమును వీడి
బాధలఁ ముంచె దీవు గం । గాధరుండ.

(అటునిటుఁ జూచి) ఆవచ్చువా రెవ్వాగు చెపుమా! ఒంటరి గ నిస్సహాయనై యున్న నాదెసకు రాఁ గారణంబేమో

కానిమ్ము! తెలిసికొందునా! అన్ని యాశలు వదలుకొని యేగదా యిట్టి ఘోరారణ్యంబున నసుగుఁ బెట్టినది.

గీ. కాఁగలది కాకమానదు। నాగతికయి
యెట్లు జరిగిన నేడ్వను। యిట్టి శిశువు
నేమి చేయుదునా యంచు। నేడ్చుదాన
శివశివా! దిక్కునీవె ర। క్షింపవయ్య.

(అశ్వనీ కుమారులు వచ్చి శృంగారాభినయము చేయుచుందురు)

రత్న—వీరు కాముకులు. పరపురుషుల మోములఁ దిలకించుట కుల కాంతలకుఁ బాడిగాదు గానఁ దలవంచుకొనియెద.

1 అశ్వ—

ఉ. ఎవ్వరి దానవీవు తర। శేక్షణ తెల్పుము భీతిలేక నీ
వివ్వనమందు నొంటరిగ। నీగతినుండుట కేమిహేతు వీ
జవ్వనమేఁడ? క్రూరతర। సత్వ భయంకర కాననంబు నం
దివ్విధినుంట యేడ! గన। నీవన దేవతవో! తలోదరీ.

రత్న—(నిరుత్తరురాలై యుండును.)

అశ్వ—ఓ కాంతామణీ!

గీ. పలుకు బంగారమా! మేము। నిలచి నీదు
చరితము వినంగఁ గోరి వా। క్షమున నడుగ
శిరమునెత్తి యుత్తర మేని। చెప్పకుండ
అటులె వంచుక నిలుబడి। తబుఁ యేల?

రత్న—(తనలో) ఓహో! వీరు నారూపంబును జూచి కామాంధులై వచ్చినట్టు లున్నవారు. వీరితో నేమి సంభాషించుదును. ఏమి ప్రత్యుత్తర మిత్తును. దైవమా! ఏమి దిక్కు. (ప్రకాశముగ) అన్నలారా! నా యార్తి నూరార్చవా

రా? తీర్చువారా? నాగతి యెట్లున్న నేమి? వరకాంతల
పరిస్థితులు మీకేల? మీత్రోవ మీరు బోవరాదా?

2అశ్వ—ఆర్చుటకును తీర్చుటకును రాకపోయినను అబలవే! సుకు
మారిణివే! యిట్టి ఘోరారణ్యములో నీ శిశువును యొకని
వైచుకొని యేల యీదుస్థితినుంటివని ప్రశ్నించుట దోస
మాయెనా? ఇష్టమున్నఁ జెప్పుటయు లేకున్న మిన్నకుంట
యేగాని దారి మధ్యంబున దీనయై గాన్పించు వారి పరిస్థి
తులఁ దెలిసికొనఁగోరుట. అధర్మంబని నీవు పలుకుట యెం
త విపరీతముగ నున్నదో యోచింపక పోతివిగదా.

రత్న—(తనలో) పరపురుషుల మోము త్తి చూచి యెఱుంగని
నేను వీరితో సిప్పుడు ప్రసంగింపవలసి గూడ వచ్చెను.
(ప్రకాశముగా) అన్నలారా! సింహకేతుని తనయను.
చంద్రమూడ మహారాజు కోడలను. విధికృతంబున నేనీ
బాలుని పెనిమిటిగఁ బడసి వీని పోషణార్థమై యివ్వనం
బునఁ జేరితి.

1అశ్వ—(పరిహాసముగా) ఓ నపూర్వ యౌవనవతీ!

గీ. సకల సుఖముల పొందెడు । సమయమందు
నెటులఁ బడితివి గోతనో । యిందువదన
పడితివే చూడు శాస్త్రమె । ప్పగిది నొప్పు
ధర్మపరు లెట్లు దీనికిఁ । దలలనూచె.

మించినదాని కేమిచేయుదుము. పోనిమ్ము. బాలుఁడెక్క
డికి పోఁగలడు. వానిపోషణాదిభారంబుల మేమువహింతుము.

గీ. సమ వయస్కులమును నతి । సరసులమును
రూపవంతులమును గాన । నో పడంతి

యిర్వురం దొక్కరిని వరి । యించి స్వేచ్ఛ
ననుభవింపుము సకల సౌ । ఖ్యముల విమల.

2అశ్వ—కోమలాంగీ! నన్ను వరింపుము.

1అశ్వ—తొందరయేల? తొలుత నన్ను వరింపనిమ్ము. ఎట్లయినను నీసుందరాంగి సుఖములఁ బొందుటగదా మనకు గావలసినది?

2అశ్వ—నాకడ సుఖించదనియా నీయభిప్రాయము?

1అశ్వ—అటులఁగాదు. మనలో మాత్రము జ్యేష్టత్వ మీమాంస లేదా?

2అశ్వ—బలాబలము సుందరాంగి సుఖము. యివి ప్రధానములుగాని జ్యేష్టత్వ మీమాంసకును దీనికి సంబంధమేమి ?

రత్న—ఇట్టి కారుకూతలఁ గూయుచుంటిరే మీయాగడమిది? ఇచ్చటనుండి తొలఁగుఁడు.

1అశ్వ—మాకు కాంతలు లేక గాదు. సౌఖ్యములు లేక గాదు. నిన్ను మించు అందకత్తెలే గలరు. ఒకరు గాదు. వేలు లక్షలును. మాకు గతిలేక కామ పీడితులమై నిన్నర్థించుచున్నటులఁ దలంచుచు మమ్మేల దూరుచుంటి వేమి? అబలవు మహా దారణ్యములో నీకూ్రర మృగనినదంబుల మధ్య నేకాకినివై యీ శిశువు తోఁబడరాని బాధలు పడుచుంటివని జాలిఁ దలఁచి యట్లంటిమి ఇంతియు గాక.

గీ. బుమతఁ జెదిగి సుఖంబుల । నిడుటలెవ్వరు
అడవిలోపీని పోషణ । నడపుటెటులు
అహరహంబును కష్టాల । కడలి యడలి
యడఁగుట యె గానివృద్ధి గా । న్పడదుపడఁతి.

సిరి రామోకాలొడ్డు కొందువా? త్రాగలేని పిల్లి బోల న
న్నుకొనినట్లు మాహితంబు నీవీనులఁ జేర్చుకొనక భావ్య
దృష్టమును చేతులార చెఱచుకొనుచున్నావు. నిరర్థక యడి
యా నలనేలఁబొందెదవు. కాన.

గీ. రమ్ము మావెంట సకల భో । గమ్ములందు;
కొమ్ము సఖ యలతో నాను । కొమ్ముముద్దు
ముచ్చటల నెల్ల తీర్చుకొ । మ్ము శశి వదన
అంతి యేగాని యీయేమ్ప । లబల!యేల?.
నన్ను పెండ్లాడుము. (అని సైగఁజేయును.)

2అశ్వ—త్రిలోకసుందరీ! నా విజ్ఞాపనముఁ గూడ నాలింపుము.

గీ. ఋషి గురుండీను గాకుంట । నిందుఁగలిసి
సౌఖ్యములఁ బొందదే తార । చాన! గాన
ఇట్టి వ్యత్యస్త పతితోడ । నేటిసుఖము
లిదు చందాన నాతోడి । పొందుగనుము.

(అని సైగఁజేయును)

రత్న—ఏమి యుదాహరణములు. ఏమి ధర్మములు. ఏమినీతులు.
యెట్టి ప్రమాణవాక్యములు, ఆహా! మీప్రసంగములు
చాలించి యింక దయచేయుఁడు. పతివ్రతా ధర్మంబులు
మీ రెఱుంగక యిటులాడుచున్నారు కాఁబోలును.

గీ. బాలుఁడైనను ముదుసలి । వాడయైన
రోగియైనను జడుఁడైన । భోగియైన
గుంటియైన గ్రుడ్డియైన । కులనతి పతిఁ
బాయకన్ గొల్చుచుండవి । ధాయకంబు.

అట్టి విధాయకధర్మంబు లాదరణముగ నం దుంచుకొని నే
నల్లాడుచుండ మోహావేశమున నున్మత్తులై ప్రేలుచ ని

ట్లగచాట్ల ముంచుట మీకు ధర్మము? పతివ్రతల నిటు
లనే బాధించి పరిభవింపఁబడిన వారెంద రుండిరో యెరుం
గుదురా?

మ. దమయంతిన్ గలయంగఁ గోరిన కిరా । త శ్రేష్ఠుఁడేమయ్యె న
క్రమబుద్ధిన్ హరియింప జానకిని శ్రీ । తున్ బొందఁడే రావణుం
డమల స్వాంతను ద్రౌపదీసతిని డా । యన్ బోవగాఁ గీచకు
యము పట్నంబున కంపడే పవనజుం । డవ్వే ప్రమాణంబులౌ.
గీ. కానఁ బరసతిపైఁ గోర్కె । బూనకుండ
గాఁబుకూతలఁ గూయక । కలి పొందు
పొందు పొందిచ్చుటను మీకు । లుండఁదగదు
లేనిచో మీకుఁ దప్పక । హాని కలుగు.

1అశ్వ—(కాళ్ళపైఁబడి భయముతో) తల్లీ! మేము నీకుమారు
లము. ఈశ్వరప్రేరితులమై నీ పాతివ్రత్యదీక్షం బరీక్షింప
వచ్చిన యశ్వనీకుమారులము. మాతా! నీవింక విచారింపఁ
బనిలేదు. నీమహాత్మ్యమున కచ్చెరు వందితిమి. ఈచిన్ని
పాపఁ డాకలిచే తపించుచున్నట్టు లగుపడుచున్నాఁడు. ఇది
యొక యమృతాంగుళీయము. (అని యిచ్చి) దీని నుండి
సదా యమృతము ధారాళముగ స్రవించుచుండును. బాలుఁ
డేడ్చినప్పు డెల్ల దీని గుడుపుచుండుము. ఈ యమృతపాన
మహిమచే శుక్లపక్ష సుధాకరుని చందంబున దినదిన ప్రవ
ర్ధమానుఁడై కొలఁది కాలముననే యౌవనవంతుఁడై దీర్ఘా
యుష్మంతుఁడై నీమనోరథంబుల నెల్లఁ దీర్పఁగలఁడు. ఇం
తియ గాక:—

గీ. పారిజ్య సామ్రాజ్య సుఖములఁ । బడయు లక్ష
ణంబు లెన్నియో గలవు పా । దంబులందు

కీర్తియుతుఁడౌను ప్రజలకు । నార్తిఁ దీర్చు
కంటకుల సంహరించి ప్ర । ఖ్యాతిఁగనును.

మఱియు నోపతివ్రతాతిలకమా! ఇచట కనతిదూరంమున నే కాంచీపురంబను నొక పట్టణంబు గలదు. ఆపురంబునఁ గాండవభట్టను యుపాధ్యాయుని నాశ్రయించి కుమారుని యోచిత సంస్కారములును సకల విద్యలను నేర్పింపుము. నీకే వైన నిక్కట్టులు వాటిల్లిన వేళల మమ్ము స్మరించుకొమ్మా. మేము వచ్చి నీయార్తి నడంతుము. మేమింకఁ బోవుదుము.

2అశ్వ—అమ్మా! (కాళ్ళపైఁబడి) మా యవాచ్యములను గూడ క్షమించి నాపైఁ బుత్రివాత్సల్య ముంచుము.

రత్న—కరుణామయులారా! మీరా కోదంత మెఱుంగకఁ బలికిన నాపలుకులకుఁ గినియక మాపై దయ దప్పకుఁడని ప్రార్థింతు. ఇదే నా వందనములు.

(అంత నశ్వనీకుమారులు వెళ్ళుదురు.)

రత్న—నేనును యీయమృతాంగుళీయ మాబాల పెనిమిటికిఁ గుడువఁ బెట్టెద. (తెఱవాలును.)

(అరణ్యము. రత్నమాలప్రవేశము—చెట్టుపైఁజంద్రకాంతుం డుండును)

రత్న—నిఖల లోక జనని యగు కాత్యాయని యనుగ్రహంబున నాచిన్ని మగఁడు దినదిన ప్రవర్ధమానుండై నయనముల కెంతయో యానందముఁ గూర్చుచుండె. వనపాల బాలకులతో నాటలాడుట కేగి నా మనోహరుఁ డింకను రాఁడయ్యె. ఎచ్చట నున్నదియుఁ దెలియ దయ్యె నేమిసేతును?

గీ. ముద్దు గులికెడు పలుకులఁ । బొద్దుపుచ్చు!
కాంతుఁ డొక్కక్షణం బేని । కానుపింప

కుండినన్ జలదరించు నా । గుండెకార!
యేమి సేయుదు వెదకంగ । నెటకుఁ జొత్తు.

(కొంచెము దూరము నడచి నలుదెసలఁజూచి) అదుగో! ఆకన్నె మావిగున్న నెక్కి నాచిన్ని వన్నెకాడు పండ్లు కోయుచుండెను. మందలించెద. ఓ దుండగీడా! ఏమియీ యాగడము. దిగిరమ్ము. దిగిరమ్ము. ఆ అందరాని పండ్లకేల నాసింతువు. నీకు కావలసిన ఫలంబుల నేనిత్తు రమ్ము.

చంద్ర—అమ్మా! అల్లదె చూడు. ఆకడ కొమ్మవున్నదే దానికి రెండు మంచిపండ్లున్నవి. దొందరగవాటిని కోసి కొనివత్తును. నిలువు మమ్మా!

రత్న—లోకైక సుందరా! వలదు. ఇటు చూడు:—

గీ. ఫలములను గోరి యా కొమ్మ । పైకిఁబోకు
గ్రిందుగా నున్న యీకొమ్మ । యిందుమిగుల
పచ్చ బాఱిన పండ్లునీ । యిచ్చకొలఁది
గైకొనఁగవచ్చు దిగిరమ్ము । రాకుమార.

అదుగో! అచ్చట నొక పామున్నది. రమ్ము. రమ్ము. తొందరగ రమ్ము.

చంద్ర—ఏటి మాటలమ్మా! నన్ను జడిపించు చుంటి వటమ్మా! ఇవన్నియును దాటి యాకుల చప్పుళ్ళు. ఆఫలములను కోసికొననిదే రాను. రాను.

రత్న—రా కుమారా! రావా! రాఁదలఁచుకొన లేదా! నేను పోవుచున్నాను. నీకు ఫలములక్కఱలేదా! నీవు వచ్చి మఱల యడిగిన నేనీయననుసుమా! నిన్ను దగ్గఱకు రానీయననుసుమా! నిన్ను ముద్దు పెట్టుకొనననుసుమా! దగ్గఱ వరుండ నీయననుసుమా! ఇదుగో పోవు చున్నాను. త్వరగ వచ్చెదవా! సరే. లేకున్న నీయిష్టము. నేనొక్క క్షణిక మేనినాగను.

చంద్ర—(తొందరగా దిగివచ్చి) అమ్మా! దిగి వచ్చితి నమ్మా! పో
వకు మమ్మా! వచ్చు చుండఁగనే కోపము టమ్మా! ఇదుగో!
యిటు చూడుమమ్మా! (కౌగిలించుకొనును)

రత్న—(తనలో)

గీ. మరుఁడు వెదజల్లు మోహాంపు । మందొ లేక
యిందు కిరణ ప్రసార మో । చందనంబొ
వీని యాలింగనంబుగా । వించెనౌర
స్థూల సూత్మ్న జన్ములకు సం । తోష భరము.

(ప్రకాశముగా) రాకుమారా! ఎచట నేర్చితివీకుంటరి తనము.
చూడుము వినువు లేక నీచెల్లెలక్కుటవలన చెక్కుటద్దంబులెట్టుల
కసికందినవో! మొగం బంతయు నెటుల గిరుకొనిపోయినదో.

చంద్ర—ఇదుగో! తల్లీ! నీకు మంచి మామిడిపండ్లు తెచ్చితిని
చూచుకొమ్ము. ఇవ్వి బాగున్నవా! (అనిచూపును)

రత్న—ముద్దు మాటలచే నీ బాలుండు నన్ను మరిపింపఁ జూచు
చున్నాఁడు. (ప్రకాశముగా) రాకుమారా! ఇంకమీఁద నిట్టి
దుడుకు చేష్టలఁజూపి దవయేని నేమి చేసెదనో చూడుము.
(తొడపై నిడుకొని బుగ్గదుడుచుచు) ఓవనపాలబాలకా!
యిటురమ్ము. వీని యొడలం తయు నిల్లుకసిగందుటకు
కారణమేమి?

చంద్ర—(చెప్పవలదని సైగఁజేయును.)

రత్న—ఏమి బాలకా! మాటాడవేమి?

వన—నన్ను చెప్పవల దనిసైగఁ జేయుచు న్నాఁడమ్మా!

రత్న—భయ పడకుము. జరిగిన దానినెల్ల చెప్పుము.

వన—వద్దు మొఱ్ఱో యని నేను గోలఁ జేయుచుండఁగనే వినకుం
డ మదపు టేనుగు పిల్లను దరుముకొని పోగా నదియెదురు

దిరిగి క్రిందఁబడఁ ద్రోసినది. సింగపు పిల్లనెక్కి సవారిఁ జేయుచు క్రిందపడెను. అందుచేతఁ గంది పోయినదమ్మా.

చంద్ర—అమ్మా! నేను మామిడి పండ్లీయలే దని నామీఁద కొండెములు చెప్పుచున్నాఁడమ్మా! ఇవన్నియు వట్టి మాటలు. నేనేమియు నెఱుఁగను.

రత్న—అబ్బా! ఏమి నర్దు బాటు! పసిబాలకా! ఇయ్యరణ్యంబున మెకంబు లనేకంబులు గలవు. ఎటుబోయి ఎటు వచ్చునో? నన్ను విడిచి యొంటరిగ నెచ్చటకును బోకుముసుమా! క్రూర మృగంబులతో పసిబాలురకు చెలగాటములు పనికి రావు. బాలకా! నీ యాగడముల నింక కట్టి పెట్టుము.

చంద్ర—అమ్మా! ఇంత పిటికి దాన వేమమ్మా!

రత్న—వయసునకు మీఱిన పనులలోఁ జొరుట తప్పుకదా! నీకేమి కావలయు నన్నను నేనిచ్చెద నన్నడుగుము.

చంద్ర—ఇచ్చెదవా!

రత్న—ఆహా! ఇచ్చెదను.

చంద్ర—తప్పక యిచ్చెదవా!

రత్న—ఆహా! తప్పక యిచ్చెదను.

చంద్ర—అటులయిన గుఱ్ఱములు. ఏనుగులు, సింహములు, రథములు, వీటి నన్నిటిని యిమ్ము. త్వరగా నిమ్ము. అబ్బా! ఇవ్వవమ్మా!

రత్న—ఏమి సులభమైన కోరికెలు? ఇవి నాకెటుల లభించఁగలవు. రాకుమారా! మఱి యేదైనఁ గోరు మిచ్చెదను.

చంద్ర—(ఏడ్వనారంభించును) నాకది యే కావల యును. వేఱేమియునక్కఱలేదు.

రత్న—ఏడ్వకుము. వాటినే దెచ్చెదను గాని యడవికి మాటి మాటికి నన్ను విడిచి వెళ్లెద వెందుచేత?

చంద్రి—అడవిలో నున్న క్రూరమృగంబుల వధించుటకు. శుక పిక శారికానికరాహారముకొఱకు మఱి యాటలాడు కొఱకు బాలురము గనుక వినోదముగా నచటకాలము గడుపుటకు. తెలిసినదమ్మా?

రత్న—(తనలో) ఈబాలకున కప్పుడే క్షత్రియోచిత కార్యంబులల వడుటచే నాకెంతయో సంతసము గలుగుచున్నయది. (ప్రకాశముగా) ఇట్టి సాహస కార్యంబులికమీఁదఁ గట్టిపెట్ట వలయును సుమా!

చంద్రి—అమ్మా! అట్లనే గాని ఏవి నేఁగోరిన వాటి నిచ్చెద నంటివి.

రత్న—(తనలో) ఈతండు మఱచునటుల లేదు. ఏమి చేయుదును (ప్రకాశముగా) బాలకా! ఆచంద్రబింబమువంకఁ జూడుము. నీమొగమువలె చక్కఁగా ప్రకాశవంతముగా నున్నది.

చంద్రి—అవునమ్మా! పోనీ గాని ఆచంద్రబింబమును దెచ్చిపెట్టుము. ఆడుకొనెదను. అమ్మా! ముందు నాకమితదాహ మగుచున్నది. అమృతముఁదెచ్చి పెట్టవమ్మా!

రత్న—ఆకాశమందున్న చంద్రుని దేఁగలనా? గొంతెమ్మకోరి కలఁ గోరెద వేల? రా కుమారా?

చంద్రి—(మకురు తనముఁ జూపుచు నేడుపభినయించును.)

రత్న—సరే! అమృతమును దెచ్చి యిచ్చెదను గాని నన్నుమాత్ర మింకఁ దల్లీ! అమ్మా! జననీ! మాతా! యని పిలువఁ బోకుము.

చంద్రి—మఱే మనవలయును?

రత్న—ప్రాణేశ్వరీ యనవలయును.

చంద్రి—నాకు రాదమ్మా

రత్న—పోనిమ్మ ప్రియసీ యనుము.

చంద్రి—ఇది మఱియుఁ గష్టముగ నున్న దనలేనమ్మా! చిన్నపేరు చెప్పుము.

రత్న—చిన్న దనఁగా నెంతపేరు కావలయును.

చంద్రి—(వేళ్ళు ముడిచి) చిన్న యింతపేరు చెప్పుము.

రత్న—(నవ్వుచు) ఇంతపేరెట్లుండును? రత్నమాలా! అనుము.

చంద్రి—(అభినయముతో) చిన్న యింతపేరు చెప్పుమన్న పెద్ద అంతపేరు చెప్పెద వేల నమ్మా!

రత్న—రత్న—మాల. అని విడి విడిగా పలుకుము.

చంద్రి—(గారాబముగా) నాకు తెలియదు. అమృత మిమ్ము. నే నమ్మాయనియే పిలిచెదను.

రత్న—ఏమి గడుసుదనము. అబ్బా!

గీ. వనము లకుఁబో వలద టంచు । బ్రాలుమాలి
వినక వెడలి మృగంబుల । భీతిలేక
దరుమ గలుగు దువది గాక । దబ్బరలకు
నదురు లేకుండ నాలుక । వదలఁగలవు.

గాని "ప్రియసి" యంచుఁ బ । ల్కఁగఁగలవె?

గీ. అడవు లకుఁ బోవనేల యం । చనుగకూర
మృగముల వధించు కొఱకు నా । మిత్రవరుల
గూడి కాలంబుఁ బుచ్చుట । కొఱకుఁబఱి
జాలమును కొట్టుకొఱక ని । బాలకా! వ
దించు నీవు నాపేరు వ । చించలేవె!

చంద్రి—అబ్బా! నాకు రావమ్మా! అమృత మీయవమ్మా!

రత్న—(తనలో) అయ్యో! పట్టిన పట్టు వదలకున్నవాఁడెట్లు కొట్టుకొందును? (ప్రకాశముగా నుంగర మిచ్చుచు) ఇదుగో! దీనియందలి యమృతమును గ్రోలుము.

చంద్రి—నాకక్కఱలేదు. (పారవేయును.)

రత్న—మఱేమి కావలయును?

చంద్రి—దేవతలు త్రాగెడు అమృతము కావలయును.

రత్న—అది నరమాత్రులకు సాధ్యమగునా?

చంద్రి—(బిక్కమొగము( జూపుచు నేడ్చుచు క్రింద( బరుండును.)

రత్న—అబ్బా! అంత కంతకు ముద్దుముదురుచున్నదేమి? కానిమ్ము యిచ్చెద రమ్ము (అని దగ్గఱకు( దీసికొని యధరామృతమిచ్చి ముద్దుబెట్టుకొనును) బాలకా! చూడుము. మాటి మాటికి నేలపై( బడి దొర్లు చుండుటచే నీకొప్పున( దురిమిన పూవులన్నియు నెట్లు జారి పోవుచున్నవో! మఱల ముడిచెద నుండుము. (అట్లొనర్చును.)

చంద్రి—ఇప్పుడు నాకొప్పు చూపించ నమ్మా, పూవుల నేటుల దురిమితివో చూచెద.

రత్న—నీసిగను దురిమిన విరులు నీకగుపించునా?

చంద్ర—అట్లయిన విప్పి పారవేయుదును.

రత్న—(తనలో) ఓహో! ఇది కుదిరినది. (అద్దంబున( జూపుచు) ఇకనీసిగ( జూచుకొనుము.

చంద్రి—ఈయద్దము నాకక్కఱలేదు. (అల్లరిచేయును.)

రత్న—మంచి యద్దము నిచ్చెద నూరుకొనుము. అల్లరిచేయకుము. నీవు చాలమంచివాఁడవు. (అని ముద్దుపెట్టుకొనును)

చంద్రి—ఆపాడద్దముకన్న యీ రెండద్దములు బాగుగ నున్నవి. (అని చెక్కిళ్ళను జూపును) నాకీ వెధవ పూవు లక్కఱలేదు. (అనిఅన్నియు( దీసి పార వేయును.)

రత్న—ఏ పుష్పములు కావలయును?

చంద్రి—మంచిపూవుల నీనోటిలో దాచుకొని పాడు పువ్వులు నాకు తురిమెదవు?

రత్న—నానోటిలో నున్నవా?

చంద్ర—నేను చూపెద నోరు తెరువుము,

రత్న—(తనలో) ఈ తుంటరి కాని యాగడ మంత కంత కతిశ యించుచున్నది. కాని యిది నాకు వినోదముగ నేయున్నది. (నోరు తెరచును.)

చంద్రి—అదియే; ఆఁ! అవ్వి నాకుఁ గావలసినవి!

(పండ్లఁజూపి) గీ. వాని బోలిన యట్టి ప్రి । సూసములును
(మోవిఁజూపి) వీనిఁ బోలిన స్రాంవగు । విరులుమతియు
(కుచముల,జూపి) వీనిఁ బోలిన సుమములు । గానినాకు
పనికి రావమ్మ! మాయమ్మ । గాన తెమ్మ.

రత్న—(తనలో) ఏమి వీని శృంగార విలాసాభివర్ణము.

గీ. మల్లె పూలకు సరిఁజేసెఁ । బల్లువరుస
పోల్చెఁగా మంకెనల తోడ । మోవిమతియు
కుచయుగంబున కీడ్చేసి । గుచ్ఛములను!
బాపురే యెంత సంతోష । పడగవలయు.
(సంతోషముతో) బాలుఁడైన యప్పుడె యింత । వలపుగొలుప
యౌవనుండయినప్పు డే । ననుభవించు
భాగ్యమింకెంత యుండునో । పలుకవశము!
దైవమా! నీనహాయంబు । దరమెపొగడ.

(ప్రకాశముగా)అట్లనే తెచ్చి యిచ్చెదను.(అని విరులు మడు చుచుఁ దనలో) నా దశ్వనీకుమారులు నాప్రాణ నాయకు నకుఁ గొంచెము జ్ఞానోదయమైన వెంటనే విద్యాభ్యాసము

కొంటకు గాంచన పురంబునకుఁ దోడ్కొని వెళ్ళుమని యాన తిచ్చిరి. అట్టితరి సంప్రాప్త మైనపుడు యూరకుండ రాదు.

చంద్ర—ఏమిటమ్మా! ఆలోచించుచున్నావు.

రత్న—రాకుమారా! ఏమియును లేదు. నీకుజ్ఞానోదయ మైనది. ఇఁక క్షత్రియోచితసంస్కారములు జరుగ వలసియున్నవి. ఇది యరణ్య మగుటచే నట్టివి జరుగఁ జాలవు. కాన నీవన పాల బాలుని తోడుగా నిచటి కనతి దూరంబు నందున్న కాంచన పురంబున కేగుదము. రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

పాఠశాల

[ప్రవేశము కాండవభట్టు బడిబాలురు]

కాండ—ఓరి మాధవా! మహారాజు కొమారుని మంత్రిగారి కుమారుని తోడ్కొని రమ్మని రాఘవుని బంపి చాలసేప యినప్పటికి యింకను రాకున్నారేమి?

మాధ—ఈపాటికి వచ్చుచుందురు. మీరు పంపగానే రాఘవుఁడు వెళ్ళలేదు. ఇప్పుడే వెళ్ళినాఁడు.

కాండ—అంత వఱకేమి చేయుచున్నాఁడురా!

మాధ—అమ్మగారు పిలువఁగా వెళ్ళినాఁడండి.

కాండ—ఎక్కడకు?

మాధ—గది లోనికి

కాండ—వెధవా! అమ్మగారు పిలువగా గదిలోనికి వెళ్ళడ మేమిటిరా?

మాధ—ఉప్పు బుట్ట తెచ్చి యివ్వమనఁగా వెళ్ళినాఁడండి.

కాండ—ఆలాగున దిన్నగా నేనుచ రాదురా! ఈమారసందర్భపు

కూతలు కూసి నావంటి వీపు పగులను జాగ్రత్త. ఏమను కున్నావో?

మాధ—గురోత్తమా. అటు చూడండి. అనుగులు లెక్క పెట్టు కొనుచు వచ్చుచున్నారు.

కాండ—ఎవరు రా?

మాధ—మన దుర్మతియు, దుష్టబుద్ధియును రాఘువుఁడును.

[వీరు ప్రవేశము]

కాండ—నే డింత యాలస్యముగ నేల వచ్చితిరి?

దుర్మ—నేఁ డనాధ్యాయమని యాలస్య మొనర్చితిమి.

కాండ—అవును. ఏది? (చేయిఁ జాప దుర్మతి రూకనిచ్చును) వీరికి జదువువచ్చునా? చేష్టలను బట్టియే కాఁబోలు తల్లిదండ్రులు సరియగు నామములను పెట్టించినారు. వచ్చిన నాకేమి? రాకున్న నాకేమి? (ప్రకాశముగా) సరే కూర్చుండుఁడు. స్తోత్రపాఠములఁ జెప్పి పంపి వేతును.

[వీరు కూర్చుందురు]

పిమ్మటఁ జంద్ర కాంతుని వెంట నిడుకొని రత్నమాల ప్రవేశము.

దుర్మ—(రత్నమాలను జూచి దుష్టబుద్ధితో రహస్యముగా) మిత్రమా! చూచితివా? ఈజగన్మోహనాకారమును?

గీ. ఇంద్ర నీలములను బోలు ׀ యింతి కురులు
వజ్రముల డాలుని రసించు ׀ పల్లువరుస
కెంపు గమి సొంపు నెంతయు ׀ గేరుమోవి
కలిగి రాణించు నీకల్కి ׀ గంటె సఖుఁడ.

ఉ. ఈ రమణీ మణిన్ నలువ ׀ యెంతయొ శ్రద్ధగఁ బోతఁ బోసి యా
తీరున వంపెగాదె జగ ׀ తిన్ భ్రమియింపఁగఁ జేయ నిట్టి శృం

గారముఁ గాంచి నారమె జ । గాన జనించిన నాటఁగోలె న
వ్వారికి దక్కఁ గాఁగలదె । భామిని గూడి సుఖించు భాగ్యమున్
దుష్ట—నిజమే. కాని రవంత సేపూరకున్నచో యీకాంత
యుదంతం బెల్ల గ్రహించఁ గల్గుదుము.
రత్న—(తనలో) ఈ మహానీయుఁడే యుపాధ్యాయుఁడై యుండును.
వనపాల బాలకుని సహాయముచే సుఖంబుగ నిచటకుం జేరు
కొంటిమి గదా? మహాత్మా! వందనంబులు.
చంద్ర—గురువర్యా నమస్కృతులు.
కాంత—అభీష్ట సిద్ధిరస్తు. అమ్మా! మీరెవరు? ఈ బాలకు నిట
కున్ దెచ్చిన కారణంబేమి? సవిస్తరంబుగ నెరిఁగింపుము.
రత్న—ఆర్యవర్యా—నాపేరు రత్నమాల యనియు నీబాలకు
నిపేరు చంద్రకాంతుఁ డనియు యందురు. ఈ రాకొమ
రునకు దమ వలన క్షత్రియోచిత సంస్కారపురస్సరంబుగ
విద్యాభ్యాసముఁ జేయింప వచ్చితి. అదిగాక
ఉ. అన్య సహాయ హీనను ద । యామతి మమ్ముల నాదరించి సా
జన్యుల టంచుబల్కరను । సంగతి నిల్పఁగ దయ్య వీనికిన్
మాన్యుఁడ టంచుఁ గీర్తిగను । మార్గమునీఁ గదవయ్య మీరుగా
కన్యులు లేరు మాకిఁకను । అన్నిటికిన్ దమరే మహాశయా.
కాంత—(తనలో) ఆహా! ఏమి యీబిడ వినయ వివేక శీలత.
ఈమె యందుత్తమకాంత లక్షణంబులు శాస్త్రీయముగఁ
జెప్పకఁ జెప్పుచున్నయవి.
కం. పలుచని పెదవులు వింధ్యల్లన్
గెలి చెడు కనుబొమలు జిగురు । కేలుంగరములీ
కల కంఠ కంఠ నినదము
గలుగుట నీబిడను సాధ్వి । గాఁదలఁపఁదగున్.

ఇంతియుగాదు. ఈబాలకునియందు చిహ్నములును గొప్పవియే
గీ. ఎగు భుజంబులు జానువు । లెనయఁజేతు
లతి విశాలము లగువీను । లంటుఁ గనులు
వెడద యురమును సన్నఁగా బెసగు గాను
గొప్ప వాఁడగు ననివీనిఁ । జెప్పఁదగును.
సల్లక్షణలక్షితుం డగుశిష్యుండు చేకూఱి నపుడే నా యుపా
ధ్యాయ పదవి ధన్య మందును. అక్కఱకు రాని నిష్ప్రి
యోజక శిష్యులు ఎందరున్న నేమిలాభము? ఇట్టి బాలకుని
సకల విద్యాపారంగతుని చేయుటయే నాప్రధానకర్తవ్యము.
(ప్రకాశముగా) అమ్మా! రత్నమాలా! నీకు భయములేదు.
నిన్ను నాపుత్రిక విధాన నరయు చుందును. నీ కేలోపమును
రానీక నీకోరిక నెరవేర్తును. ఈరాకుమారున కనతికాల
మునకే సకల విద్యలలవడఁ గలవని దెలియు చున్నది. జేపు
బాగుగ నున్నది. విద్యాభ్యాసమున దొరకొనుటకు. ఓరీ
రాఘవా! నీవీ బాలకుని యీరత్నమాలను లోనికిగొని
పోయి యమ్మ గారికిఁ జూపిరమ్ము.
రాఘు—చిత్తము. రండి
కాండ—శిష్యులారా—మీ యందఱకును బాఠములు రేపే చెప్ప
దను నేటికిఁ బొండు.

(అందఱునిష్క్రమింతురు)

---

దుర్మతిప్రవేశము—ప్రత్యేకాంకము—

(స్వగతము) ఆహా! నాకీ సంతాప మెట్లడంగును? ఓరీ!
మదనా! పదు నాయు ధంబుల నాపై బ్రయోగించి వేపుట
కిప్పుడ దనయ్యెనా!

శా. మారా! నీ పొగరింక సాగదు రభా । మారత్నమాలానాఁడో రే
పో రావచ్చును బట్టవచ్చుఁ జరనం । బుల్ తప్పు సైరించుమం
చా రాధించుచు నన్ను మేమఱపునైక్యంబంది క్రీడించు చో
క్రూరా! వంచవె నీశిరంబపుడు నీ । కుక్ సిగ్గుఁ దోఁపింపనే
చంద్ర కాంతుఁడు జీవించి యుండఁగా నాకోరికె నెఱవేరు
నటుల గాన్పడదు. కావున నే నెచ్చెలియగు దుష్టబుద్ధిఁ
బ్రోత్సహించి వానిని దోడ్కొని రమ్మని పంపితిని. అతఁ
డింకను రాకుండెను? అబ్బా! అబ్బింబోష్ఠవతి రూపము
సర్వదా నాకన్నులకుఁ గట్టినట్టులే గాన్పించు చున్నదిగదా!

ఉ. ఎన్నఁడు చంద్రకాంతుని వ । ధింతునో? యాతరుణీ లలామనే
నెన్నఁడు చేట్టఁబట్టెదొ? స । హింపఁగలాఁడ నేయంత దాకనా
చిన్నెల వన్నెలాడి నను । శీఘ్రగతిక్ సుఖపెట్ట కున్న చో
మున్నగు నాజయంబిపుడు । మారుని పోటులు మిక్కుటంబుగన్

దుష్టబుద్ధి ప్రవేశము.

దుష్ట—(ప్రవేశించితనలో) ఏమి వీని పరితాపము? రత్నమాలను
జూచిన నాటనుండియు నన్న పానీయములే యొల్లక తదేక
ధ్యానాయత్త చిత్తుండై ప్రపంచమే మఱచియున్నవాఁడు?
(ప్రకాశముగా) మిత్రమా!

దుర్మ—(ఆతురతతో) వచ్చితివా? చంద్రకాంతుఁడేడి!

దుష్ట—వచ్చును. తొందర పడియెద వేమి?

దుర్మ—నాబాధ నీకెటులఁ దెలియును! చూడు

గీ. పంచ శరుఁడిట్లు నన్ను । వంచించు చుండ!
క్షత్రియకులా నబుట్టి । శస్త్రమును చేత!
దాల్చియును గూడ వ్యర్థుఁనై । దనర వలసె!
వలసినట్టి వస్తువు లేని । వలననిటుల!

దుష్ట—వలసి నట్టి వస్తువు నార్జించుటకుఁ జంద్రకాంతుఁ డేమి చేయఁ గలఁడు?

దుర్మ—అయ్యో! పిచ్చివాఁడా! ఆతని యునికియే మనకు ప్రతి బంధకము.

గీ. చంద్రకాంతుని జీవముల్ । జగతి నెంత
దాక నిలుచునో మనకంత । దాకఁ జేత
చిక్కరా నట్టి వస్తువా । చిన్నపనిము
గించు కొందును క్షణముల్లో । గెలుతుమరుని.

దుష్ట—నీసంకల్పమే నెఱవేఱును. కాని యాతురపడిన ప్రయో జనమే మున్నది! తలఁచిన కార్యమా! దొడ్డది. కావలసిన పదార్థమా! యనన్య సామాన్యమైనది. మన వ్యూహమునఁ జిక్కవలసిన వాఁడా మహాబలాన్వితుఁడు. అదిగాక నాతఁడు కూడ క్షత్రియ కులోద్భవుఁడే. పన్నెదు మాయో పాయములకు వలసిన కాంతంబు లేకున్న నెటులు! (అటుని టుఁజూచి) ఇక నీకాతురతయే అక్కఱ లేదు. అదుగో వచ్చుచున్నాఁడు. చూఁడుము.

(చంద్రకాంతుఁడు ప్రవేశము)

చంద్ర—(ప్రవేశించి) నా దెలికాంద్రగు దుర్మతియు దుష్టబుద్ధియు వన విహారార్థమై రమ్మని పిలచిరి. "మేమిరుపురమును ముం దు పోవుచుందుము. నీవేరికిఁ దెలియనీక మనగురువు గారిక న్నొరంగి రమ్మనిరి" వారి ప్రోత్సాహము మాటలెల్లున్నను.

గీ. ఎన్నఁడబ్బు విశ్రాంతి ప్రే । యింబవళ్ళు
నెడ తెగని చదువ్వచే శ్రమ । పడుటవలన
యనుచుఁ దలపోయ నాకునే । డబ్బెనట్టి!
సౌఖ్యమట కొంత కాలంబు । సంచరింతు.

అగుగో! వారును యిచటనే యున్నారు. (దగ్గఱకుఁ బోయి) మిత్రులారా! యిచ్చటనే యున్నారా? (కౌగలించుకొందురు)

దుర్మ—(తనలో)

గీ. లేని ప్రేమంబు కొంత నేఁ । బూనకున్న!
వన్నినట్టి వ్యూహము నందుఁ । బట్టువడుట!
దుర్ఘటం బయ్యె డిని వీని । తోడనిపుడు
సఖ్యముగనే ప్రసంగంబు । సలుపు టొప్పు.

(ప్రకాశముగా) మిత్రమా! ఇంత తడవేలఁ జేసితివి?

చంద్ర—గురువుల వారికి దెలియకుండ సన్న సన్నముగ వచ్చుటచే నింతయాలస్య మైనది. క్షమింపుఁడు.

దుర్మ—ఇందు క్షమింపఁ దగినదే మున్నది? (తనలో) నిన్ను క్షమింపవలయునుగా, నిన్నే క్షమించిన నాకామదవతి యెట్లు దక్కఁగలదు? (ప్రకాశముగా) చంద్రకాంతా! మన యొజ్జ కడుదుర్మార్గుఁడు సుమీ!

చంద్ర—అట్లన రాదు. గురునింద మహాపాతకము. మనము కాలము నన్యథానుపయోగ పఱుపగురువు లిచ్చగింపరు. అందుచే మనకు కంటకులుగాఁ గాన్పింతురు.

దుర్మ—మిత్రమా అట్లనే! క్రూరమృగంబులుగల మహాదారణ్యము. కొంచెమునే పాయరణ్యప్రాంతమున విహరింతము. వాటిగర్జితారవంబు లాలించి, అచ్చటనుండు లేడిపిల్లల చెలగాటములఁ దిలకించి, వినోదించి వత్తము పోవుదమా!

చంద్ర—మంచిది నడువుఁడు?

(నిష్క్రమింతురు)

---

## అరణ్యము.

(పైముగ్గురును బ్రవేశము)

చంద్ర—మిత్రులారా! లేని నిందల నాపై నాడిఁకట్టి నన్నిట్టు లకారణంబుగ జంపఁజూచుట భావ్యమగునా?

దుర్మ—ఓరీ! కపటశీలా! క్రిందుమీఁదును గానక నీపై నేమో గురువునకు దయగలదనియు, వాని యింటనే నుంటిఁగదా యని యు మిట్టిపడుచుంటి వేమో! నీగతి యిప్పుడే మఱునో చూడుము.

చంద్ర—సంగడీడా! మీపై నేనెన్నఁడు మనగురువు వారితో గొండెములు పలికి యుండలేదు. నామాటలనమ్ముఁడు. మిత్రధర్మము నే నెఱుంగనిదిగాదు. ఒరులపైఁ గొండెములువల్కుటయు నామతముగాదు. నాయట్టి యభాగ్యుని, నిరాయుధునిఁగా జేసి యీమహారణ్యమునకు మోసవాక్యములచేఁ దోడ్కొనివచ్చి వధింప నుంకించుట ధర్మముకాదు. ధర్మము కాదు. ధర్మముకాదు.

దుర్మ—నీకు మిత్రధర్మములే బాగుగా దెలిసియున్న యెడ ముసలి యొజ్జతోఁ జాడీలు చెప్పి మమ్ముల నేల దండనార్హులుగఁ జేసియుందువు?

చంద్ర—వీరికెవ్వరో దుర్బుద్ధు లుపదేశించిరి. పట్టిన పట్టు విడుచునటులలేదు. వీరి మనముల నే నెటులఁ బ్రసన్నతఁ జేసికొనియెదను. (ప్రకాశముగాఁ జేతులుబట్టుకొని) హితుఁడా!

క. పితయును మాతయు, హితుఁడను
త్రితయంబును బ్రకృతి సిద్ధ ॥ రీతిని హితమా
తృతి కార్యకారణతచే
హితబుద్ధులుగారె తలఁప ॥ నితరజనంబుల్

గీ. హితునితో మాట లాడుట । హితునితోడ
నొక్కతావున మెలఁగుచు । నుంటఎవని
కగునొ యాతనికన్న నీ । జగతి లోనఁ
బున్నెముల ప్రోవు వేరొకఁ । డున్న వాఁడె?

దుర్మ—ఓహో! ఏమి నీహితోపదేశము? అత్త ఱంకుఁబోయి కోడ
లుకు నీతిఁజెప్పు నటులున్నయది. దుర్మతి యీనయగారవు
మాటలకు లోఁబడఁడు. నీవెన్ని చెప్పినను నిన్నుఁ జంపక
విడువను. తిన్నఁగ నిలువుము.

చంద్ర—మిత్రమా! అంతటి కఠువహింప నేవిన్నవించెడు దేము
న్నది? ధర్మాధర్మములు నరయుమంటి. ఏపాపమెఱుఁగ
నంటిని. కపటవృత్తిని జరించుట లేదంటిని. కాళ్ళ వ్రేళ్ళ
బడి బ్రతిమాలు చుంటిని. నిరాయుధుఁడనని మొత్తుకొ
నుచుంటిని. అభాగ్యుని వధించుట పాతకమని విన్నవిం
చితిని. నావేఁడుకోలు లన్నియు నిష్ప్రయోజనములై తాఁ
బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళను వాదమునకుఁ దొఱఁగి
చేతులు బట్టుకొని యిట్లు నిర్బంధించుచుండ నేనేమి చేయ
గలను. సర్వశక్తుఁడగు నాపరబ్రహ్మయు, నార్తరక్షకురా
లౌ కాత్యాయనియుఁ దోడయి నేను నిరపరాధినని జాటి
నాబన్నంబు నివారించవలయును గాని మానవమాత్రుఁ
డనై యందునను బాలుండనై నేను మీకేమి విన్నవించ
గలను?

దుర్మ—ఓరీ! అసంబద్ధప్రలాపీ! నీబన్నంబు నివారింపఁ బరబ్రి
హ్మయు కాత్యాయనియు శక్తులా? ఈ కరవాలంబులకు
ముందుఁ బ్రత్యుత్తర మిమ్ము. పదంపడి వారు వత్తురు.
మిత్రమా! దుష్టబుద్ధీ! ఏల జాప్యము.

[ఇరువురును ఖడ్గంబు లెత్తఁ జంద్రకాంతుఁ డటునిటుఁ బరువెత్తుచుండఁ బట్టితెత్తురు.]

చంద్ర—మిత్రులారా! ఏల యింత సాహసంబునకుఁ బూనుకొని యెదరు. నావిన్నపము సాకల్యంబుగ నాలించి మీకయ్యది రుచింపకున్న నట్లనే యొనర్చెదరుగాక.

దుష్ట—రాకుమారా! అదేదియో వించము.

దుర్మ—పారిపోఁగలఁడు.

దుష్ట—ప్రాణములతోడనేనా!

చంద్ర—మిత్రులారా! ప్రాణములపై నతనకునెంతతీపియుండునో పరుల ప్రాణములపైఁ బరులకు గూడ నంతటి తీపియే యుండునన్న యోజనలేక శరణంబన్న నాస్తియనుచు జీవ కోటిపై సజ్జనులెంతటి దయారస చిత్తులను జూపుచుందు రోయన్న విచారణలేక మీరొనర్చు నేరస్థాపనకు తగిన యాధారములు లేక గ్రీడా విలాసార్థమను మిషమీఁద నన్నుఁ గొనితెచ్చితిరే. ఏకపట్టణవాసులమై యందులకు ఏకతటాకజలపానవాత్సల్యమైనను లేక నన్నకారణంబుగ మీఖడ్గంబుల కెఱజేసి తద్రక్తంబున నీభూదేవి కభిషేక మొనరించిన మీకుఁగలుగు లాభమేమి? అయ్యో! తృటి కాలమేని నన్నుఁ బాయుటయన్న ప్రపంచమే మునిగిపో యినటులఁ బరితపించు మామాతృదేవికిని నాకును దూర ముఁజేయుచున్నారే! ఇది మీకు న్యాయమగునే? నామృతి వార్తవినిన నింక మాయమ్మ జీవములతోడ నిలువఁగలదా! లేనినింద నానెత్తిపై వేయుటకే మీరు పూనుకొనినచో మాయునికియే మీకుఁ గంటకమైనచో నీక్షణంబున నీ యూరువిడచి మఱియొక తావునకుఁ బోవుదుము. మీరు

సుఖంబుగ నుండఁదగునే? శరణాగత రక్షణంబు క్షత్రియో
చితాలంకార మనుమాటయేని దలపెట్టక గళకు కరవాల
మున శిరమునఖుకుదుమని కటికవాని విధాన మనుసరించు
చుండిరే? అయ్యో! ఇట్టి వధావిధానములఁ దిలకించి మన
దౌష్ట్యములఁ గూర్చి మన దేశ జనయిత్రి యెంతగ విలపిం
చునో గదా! ఆమె హృదయంబున కొరాటముఁ బుట్టిం
చుట భావ్యమగునే? సోదరులారా! పరమపావనంబగు
క్షత్రియకులంబుల కేల నకారణంబుగ కళంకముఁ బుట్టిం
తురు.

దుర్మ—ఈధర్మోపన్యాసమేకరువుఁ బెట్టుటకేనా ఇంతకష్టపడితివి?
చాలు. నోరుమూయుము. కదలక నిలువుము. (కత్తుల
నెత్తుదురు.)

చంద్రి—మిత్రులారా! నా హితవాక్యంబులు మీకు విషప్రాయ
ములయ్యెనే! ఇంక నేమిచేయుదును. ఒక్క త్రుటికాలమేని
యాగుఁడు. నామాతృస్వరూపిణి నైన యింత ధ్యానించుకొని
మీకరవాలమున కెఱయగుదును.

దుర్మ—కానిమ్ము. జాగుచేయకుము.

చంద్రి—ఓ! కరుణాస్వరూపిణీ!

గీ. కనిన దేలకో నన్ను బెం । చినదియేల
కోమె ఱుంగక మున్నెయా । యువునకింత
మూడె నమ్మవిఘాతమ్ము । యీడువార
లంత మందిం చుచున్నార । లమ్మనన్ను.

మ. వలదన్నన్ వినకా వనంబులకుఁ బో । వంగోపమున్ బూనక
ట్టుల శాంతంబున జూచి తమ్మ పలుపా । ట్లున్ జెంది నా కెన్నివి

ద్యల నేర్పించి తివమ్మ నీకుఁ దగునా । ధారంబు నాదంచునా
శలు నట్టేట మునుంగ నున్న యవి యీ । చందంబునన్ దల్లిరో.

ఉ. నాయభి వృద్ధి గోరుచు ఘ । నంబగు నిష్టను నీవు తల్లిరో
నో యని నోము లేదు, తల । నొప్పి జనించె నటన్న లోకమే
పోయెన టంచు నేడ్చి తివి । మూలము నిన్ను విచార వార్ధిలో
ద్రోయఁగ నేను గాదె యిటు । దుష్టుల బాటికిఁజిక్కి చచ్చుటన్

గీ. తల్లి! నీ ఋణమును దీర్చి । ధన్యనయ్యె
దనెడు నా యంశ మెల్ల వ । మ్మయ్యెనమ్మ
మృత్యు దేవత నావెంట । నృత్యమాడు
కొనుచు నిట్లు వెన్నాడు చుం । డినది తాన.

గీ. క్రూరులై రెండు వైపులఁ । జేరి శత్రు
రాజముల నెత్తి నాదు శి । రంబుఁ ద్రుంప
సిద్ధ పడి నారు నిన్ను వీ । క్షించుభాగ్య
మంత రించె గదమ్మ యో । యమ్మయింక

గీ. నా మరణ వార్త వించు చిం । తానముద్ర
మెట్లు దరి యింతువో జీవ । మెట్లు నిలుపు
దానవో! తల్లి యేమన । దైవ విధికి
దూరెద వోయీ యభాగ్య కు । మారుఁ గూర్చి.

గీ. శశి దివాకరు లార సా । క్ష్యంబువలుక
నిలువ గారాదె నా యందు । నేర మేమి
లేదను చుయిట్టి నిర్భాగ్యు । మీద మీరు
జాలి వహియింపరే నాదు । గోల వినరె?

గీ. మేఘమా నర్వ్వెడద వేల । మేలమాడు
రంతదుర్భరకష్టాబ్ధి । యందు మునిఁగి
తెలివుఁగానక విలపించు । దీనుతోడి

ఆగి నావిన్నపంబు మా । యమ్మవినఁగఁ
దెలుపఁగదవమ్మ నిన్నుఁ బ్రా । ర్థించెదమ్మ.

గీ. సర్వలోక శరణ్య! ఈ । శ్వరకృపాళు!
జనని కాత్యాయనీబాల । కుని మొరాల
కించి యన్యాయములను వా । రించికృపవ
హించి రక్షింతురో లేకఁ । దుఃఖించఁ బడఁగ
వదలెదరో యాతని పా । ప్రమమె మీరు
వడెదరో యేదియో తేల్చ । వలయు రండు
దోషుఁడను కాను యెవ్వరిఁ । తోడవైర
మునకుఁ గాల్దువ్వనైతి పీడ । నుత్వదీయ
పాద పూజలు శరణన్న । వారి లెక్క
లేక రక్షించినారు మీ । రేకటాక్ష
దృష్టులను బర్వకుండిన । దిక్కు లేది
రండు యీఘోరమును మాన్ప । రండు రండు.

(అంతొక ఖడ్గము దూరమునుండి పడఁగా గైకొని)

ఓరోరి యధమాధములారా! ఏదీ మీవాడి తనము? ఏవి మీ
రింతకు ముందాడిన పలుకులు? దుర్మదాంధులారా! మోసగించి
తెచ్చి యరణ్యంబున వంచింప నెంచిరే. శూరులైనచో నిలిచి యు
ద్ధం బొనర్చి మీకులంబును నిలుపుకొనుఁడు.

దుష్ట—(తనలో) ఏమి యీవింత! నిర్జనం బగు వనంబున నెవ్వరీ
ఖడ్గంబును వీని కిచ్చిరో! హా! చచ్చితిమి. చచ్చితిమి.

(పిమ్మట యుద్ధ మొనరింపఁగాఁ జంద్రకాంతుఁడు మిగత నిరు
వురిని వధించును)

చంద్ర—(స్వగతము) సకలలోక రక్షకుఁడగు నప్పరమేశ్వరుని
కృప నెంతేని గొనియాడఁ దగియున్నది. ఓ కృపాళూ!

ఓ చిత్స్వరూపిణీ! మీ కృపారసమే యీ నిస్సహాయకునిపై
యిపుడు పారకున్న నీవఱకు నెచ్చట నుండవలసిన వాఁడో.
పాపపుణ్య విమర్శనంబునకు మీరే పూనకున్నచో నీ లో
కము లన్నియు నేమి కావలసియున్నవో! మీ యాదరాతిశ
యంబునఁ గాదే మఱల మాయమ్మను కనులారఁ జూచు
కొని సంతసించు భాగ్యంబుఁ గల్గినది! మీ సహాయముచేతనే
గాదే అనేకకష్టంబు లంది యీ పురంబునఁ జేరి యఖిల
విద్యల నార్జింపఁగల్గినది. మీ కరుణాకటాక్షవీక్షణంబునఁ
గాదే మాయమ్మ తనకెన్ని యవాంతరములు వాటిల్లినను
వాటినన్నిఁటిని గడచి యింతదాక నన్నోవఁ గల్గినది!
మీకివే వందనశతంబులు. నేనింక సత్వరంబుగఁ బోయి
మాయమ్మను గలిసికొనియెదను.

(నిష్క్రమించును)



# సంగీతచంద్రకాంతనాటకము

## షష్ఠాంకము

### ప్రథమరంగము

(గురుగృహము. మాధవుఁడు, గురువుగారు ప్రవేశము)

మాధ—(తొందరగా బొబ్బలుఁ బెట్టుచు) లేవండి గురువుగారూ! నాకొంపమునిఁగినది. ఉండండి. ఉండండి. కాదు. మీకొంపమునిగినది.

గురు—(వడఁకుచు) వెధవా! యేమిరా! అది త్వరగా చెప్పుమురా!

మాధ—ఇంకా యేమి. యేమి. రాజుగారి వురిస్తంభానికి సిద్ధంగా వుండండి.

గురు—సంగతి చెప్పక చంపుచుంటి వేమిరా!

మాధ—ఏమంటూ చేర్చుకున్నారో. బాబూ. కొంపముంచి వేసినారు.

గురు—ఎవరురా. చెప్పరా!

మాధ—ఏమి చెప్పనూ! మాకూతురేనంటిరే. మామనుమఁడే నంటిరే. కళ్ళలన్నియు వాళ్ళమీదనే పెట్టుకున్నారే. చదువులన్నియూ వాడివే నన్నారే. ఖడ్గవిద్య చెప్పినందుకు గురుదక్షిణగా యిద్దరిని బలిపెట్టాడు.

గురు—చంద్రకాంతుఁడే! ఎవరినిరా!

మాధ—ఏవరినేమిటి. అల్లాటప్పావాళ్ళు గారండి. రాజుగారి కొడుకును, మంత్రిగారి కొడుకును.

గురు—(గుండెలు బాదుకొనుచు) అయ్యో! ఇంకేముంది. నాయనో! నేనింకా యీపట్టణంలో యెట్లా బ్రతకనురా! అయ్యో భగవంతుఁడా! ఎంత గతిపట్టింది? మాధవా! ఇఁక పోతా! ఏదోదారి చూచుకుంటా! ఇక్కడుండలేను (అని వెళ్ళఁబోవ)

మాధ—(అడ్డగించి) అయ్యో! మీదారి మీరు చూచుకుంటే అమ్మగారి దారి యెవరు చూస్తారండి. ముందా రత్నమాలా పిశాచమున కుద్వాసన చెప్పండి. మీరేమిను నెలుగ నట్లూరు కోండి. ముందా భూతాన్ని పారదోలండి. పారదోలండి. చాలు.

గురు—మంచిదారి చూపించావురా. రత్నమాలను పిలు. పిలు. పిలు. త్వరగా పిలు. ఇంకా యిక్కడనే వున్నావేమిరా!

(మాధవుఁడు వెళ్ళి మలిల ప్రవేశము రత్నమాల తోడ)

గురు—అమ్మా! తల్లీ! ఇంక మాయింటిలో నుండి యీపాటికి దయచేయుండి. మారుమాటాడకనడవండి.

రత్న—మాధవా! ఇదియేమి. మాచంద్రకాంతుఁడేడి? గురువర్యా! ఏమి విశేషము. నన్ను మీరింతత్వరితంబుగ, నిష్కారణముగఁ బొమ్మందురేల? నాయనా! మాధవా! గురువుగారు మాటలాడకున్నారు. నీవైనఁ దెల్పుము. నాయనా! (ముట్టుకొని బ్రతిమాలఁబోవ)

మాధ—(వెనుకకుఁ బోయి) నన్ను ముట్టవలదు. నాకొంపగూడ మునుఁగును. అడవిలో రాకుమారుని, మంత్రికుమారుని నీకుమారుఁడు—యింకేమి చెప్పను.

రత్న—నాయనా! పూర్తిగాఁ జెప్పుము.

మాధ—ఇంకా పూర్తిగా నేమి చెప్పుమనియెదవు (బిగ్గఱగా) చంపినాడు. తెలిసినదా! వినఁబడినదా!

గురు—(పీపుమీాదఁ జఱచుచు) అరవకురా! గాడిదె. అరవకురా! కొంపపోతుంది.

రత్న—నాయనా! మాధవా! రా కుమారుఁడును మంత్రి కుమారుడును మృతులైనారా? నీవు చూచితివా!

మాధ— మృతులగుట నేను చూడలే దమ్మా! కత్తులు పుచ్చుకొని పోట్లాడుకుంటూ వుంటే మీాఅబ్బాయి తీవ్రము చూచి వాళ్ళిద్దరిని చంపే శేవుంటా డనివూహించుకున్నా నమ్మా!

రత్న—(తనలో యౌవనమద గర్వింతుండగు నా దుర్విదగ్ధ దుర్మతి మొన్నటి దినంబున నే నుపవనంబున గురువుల వారికి శివ పూజోపయుక్త కుసుమంబులగోయుచుండ దుష్టబుద్ధితోఁ గలిసి వచ్చి తన సంపదను వెడలఁగ్రక్కుచు నన్ను కామించి వినరాని కారుకూతలఁ బ్రేలి నేనొడంబడమి నన్ను శెరఁబెట్టఁ దలంప నాశ్వినేయుల సహాయంబునఁ గాపాడఁ బడితిని. నాటఁ గోలె నేనడలుచునే యుంటిని. యీా దురాత్ములు నానాధునకెట్టిహాని దలపెట్టిరో గదా!

గురు—ఏమే పిశాచమా! మాపీకెలమీాదికేల దెచ్చెదవు. పొమ్మ.

రత్న—

ఉ. హా! విపుల ప్రభావ ! నుగు ణాన్విత! నిర్జర చంద్రకాంత! నీ
వా వని కేలఁ బోతివ క టా! యిఁకనెవ్వరు నాకు దిక్కునే
నే విధి నీవియోగము భ రించి ధరిత్రిని నిల్వనేర్తునో
నావిభు నీవఁగాచి తుద నక్కల పాలొనరించితయ్యయో.

హా! విధీ! నా వ్రాతలెంత జేయుచున్నవి.

గీ. పరమ భక్తి నహా భగ వంతుఁడా! య
టంచు నార్తా రవంబుగా వించువారి

యెడల నేక్రోధమును వహిం చియుంచిమించి
యేడిపించెదవది యెనీ కిష్టమగునె?
హా! హా! నేనెంత మందభాగ్యురాలను! నాప్రాణ వల్లభుని
వదనకమలమైన నొక తూరి చూచి యీ పాపిష్టి కష్టజీవి
తమును నాయొడయుని యడుగు దమ్ముల కడనా యడవిలో
విడిచెదను. హా నాధా! చంద్రకాంతా!

(నిష్క్రమించును)

గురు—మాధవా! చంద్రకాంతుని చంపి యుందురా!

మాధ—లేదండీ? చంద్రకాంతుడే చంపినాడు. ఈగ్రామ మిచ్చ
ట నుండి కదిలి పోవాలని రవంత హడావుడిగా మాట్లాడి
నాను.

గురు—శిష్యా! అట్లయిన మఅల నావిఅపనకొయ్య మన యింటికి
వచ్చి యీతద్దిన మంతయు మననెత్తి మీద బెట్టును
కాబోలు.

(అంత ఖడ్గముతోఁ జంద్రకాంతుఁడు ప్రవేశము)

గురు—ఓరీ మాధవా! చచ్చితినిరా. (గజ గజ వడఁకుచు.) నాయనా!
తండ్రీ! నేను బ్రాహ్మణుఁడను. అందు నను శుద్ధవైదీకిని.
మా బ్రాహ్మణజాతి సహజముగాఁ బిరికిది. చంద్రకాంతా!
నీపాదములపై వ్రాలెదను. నాజోలికి రావలదు. రక్షింపుము.

చంద్ర—అదేమి గురువర్యా! విపరీతముగ మాటలాడుచున్నారు.
మీరిటుల భయపడునంతటి యవుసరమేమికలిగె? మీకు
శిష్యుఁడనై సేవకుఁడనై వర్తించు నన్నిట్టుల వేడ నర్హమగునే?
మహాత్మా! ఏదుర్మార్గుఁడేని మీకపకారముఁ దలపెట్టి
యున్న దెలుపుఁడు సంశయింపకుఁడు. వానినిప్పుడే యీకర
వాలంబున కెరఁగావించి వానిపితృదేవతలను దృప్తిఁజెం
దించెదను.

గురు—(భయమునఁ దెల్లబోయి చూచుచుండును)

చంద్ర—గురువర్యా! సంశయింపకుఁడు.

గీ. శివునెరానిందు హరితన । చేవఁజూప
నెదురుగా నిల్వనిండు । దుర్మదుని మీఁక
పకృతిఁ దలపెట్టిన ట్టి పా । పాత్ముఁనిపుడె
ఖడ్గ రాజంబునకు బలి । గాఁగఁ జేతు.

గురు—శుద్ధ ఛాందసుఁడను. నాపైకి నెవరువత్తురు. నీవే ద్రోహ
మొనర్చితివి. నీవే నాకు భయకారణుండవైతివి.

చంద్రి—నేనే తమకు ద్రోహము చేసితినా? ఛీ! ఛీ!

గీ. గురుని కపకృతి గావించి । ధరను మనుట
కంటె చచ్చుట మేలగు । గాదె శస్త్ర
రాజమా! ద్రుంచవేల శి । రంబు? యిట్టి
పాతకుని మీఁద నీకేల । భ్రాంతి విడుము.

(అని కత్తినెత్తి శిరముఁ ద్రుంచుకొన యత్నింప గురువరుం
డడ్డమగును)

గురు—చంద్రికాంతా! వలదు వలదు. ఉన్నదానికిదితోడా?

చంద్రి—మహాత్మా! నేఁడో రేపో తమకుదు తాభక్తినిఁ బ్రకటించు
గురుదక్షిణ సమర్పించుకొందు మనుయాశతోనున్న నన్ను
ద్రోహినని యనుట తమకు ధర్మమగునే?

గురు—మాకు ధర్మమువలదు. అధర్మమువలదు. గురుదక్షిణలు
వలదు. వల్లకాడువలదు. నీవిక్కడనుండక వెడలిపొమ్ము.
నాకదియే పదివేల గురుదక్షిణలు. చాలునీగురుభక్తి. నీవిన
యము.

చంద్రి—గురువరా! తమయాజ్ఞరీతి వెడలుట విధాయకమే కాని
నాయొనర్చిన నేరమేదియో తెలుపక నన్నూరక దూషించు
చున్నారు. అదియే తగదని విన్నవించుచున్నాఁడను.

గురు—నీ నేరము నీ వెఱుఁగకనా! పాపాత్ముఁడవై రాజకుమారుని, మంత్రికుమారుని పొట్టఁబెట్టుకొంటివి. నాకూటిలో మట్టి కొట్టితివి. ననుభ్రష్టయస్తుని గావించితివి. చాలునా?

చంద్రి—దేవా! నామవి నింత నాలింపుఁడు. ఆట మొగ మెన్న డెఱుంగని యాదుష్టులు నాతోడి కపటస్నేహమాచరించి నమ్మించి క్రీడార్థమై నిర్జరారణ్యంబునకుఁ గొనిపోయి నాపైని లేని నేరములమోపి తమ ఖడ్గరాజంబులఁ జూపుచు నన్నుఁజంపఁబై నఁబడ భయోన్ముఖుఁడనై యొంటరివాడనై నిరాయుధుఁడనై విలపించుచుండ నాపరమేశ్వరునిచే యీ ఖడ్గం బొసంగఁబడ నాపాపాత్ములఁ గాలునిపంచకుఁ జేర్చి నాప్రాణంబులఁ గాపాడుకొంటిని. ఇందు నాదోస మేమి కలదు? నేనెట్లు గురుద్రోహుఁడ నగుదును?

గురు—(తనలో) నిజమే. వారిరువురును సహజదుర్మార్గులు. ఈ నేరము లిట్లుగనే జరిగియుండును. కాని యకారణంబుగ నీ చంద్రకాంతునిజోలికి రాఁ గారణమేమిది చెపుమా? (యోజించి) ఓహో! ఇదియై యుండవచ్చును. సాధ్వీతిలకమనఁదగిన రత్నమాల నెల్లవుడును తమ కేరగంటిచూపులఁ జూచుచుండురు. కావున వారికామబాధయే వారినడగార్చి యుండును. కాదామఱి, ఈ కామముచేతనే క్రోధమును దానిచేతనే మనోవిభ్రమణమును దానిచేతనే మరణమును సన్నద్ధమగుచుండును. (ప్రకాశముగా) చంద్రకాంతా! ఏది యెట్లయిన గానిమ్ము. నీవిచటనుంటివేని నాపీకిమీదికిరాఁగలదు. నీకాంతు మీరత్నమాల వెదకుకొనుచు నింతకుముందే యాయడవి దిక్కునకుఁ బోయినది. నీవునుబోయియామెను గలిసికొని యీచుట్టుపట్ల గానరాకుండ యేయితరదేశమునకేని బోయి

బ్రతుకుము. అట్లొనర్చితివా ఉభయులమును కృతార్థుల
మగుదుము.

చంద్రి—గురువరా! ఏల మీకీభయము. మనవలన దోసమున్నపుడు
గదా భయపడవలసినది? మీకేల! నిర్భయంబుగ సంచ
రించుడు.

గీ. ఈశు కృప చేత నాకు ల ꠰ భించినట్టి
యీ కృపాణమె రక్షించు ꠰ నెపుడుమిమ్ము
ప్రభున కేగాదు దాని య ꠰ బ్బకు నునేని
జడియ నక్కఱలేదయ్య ꠰ సద్గుణుండ.

గీ. ధర్మసంస్థాపనార్థమే ꠰ ధరణి క్షత్రి
యాన్వయమునిల్పఁ బరమాత్మ ꠰ యట్టియెడల
క్షత్రియుఁడనాచుఁ జేతను ꠰ గత్తి బట్టి
జడియగా నిత్తునే? భయా ꠰ స్పదుల మిమ్ము.

మహానుభావా వేయేల? నావాక్యంబుల వినుఁడు.

గీ. ప్రభుని సకుటుంబముగ ద్రుంచి ꠰ ప్రాజ్యరాజ్య
పదవి గురుదక్షిణగనమ ꠰ ర్పణ మొనర్తు
అట్లుచేయక పోతినా ꠰ ఆర్య! ఖడ్గ
రాజమునకు మదీయ శి ꠰ రంబు నిత్తు.

గురు—(సంతోషముతోఁ దనలో) నిజముగ వీఁడంతటివాఁడే యగును. తప్పక నాకీ మహాసామ్రాజ్యమును దొరకఁగలదు. (ఆలోచించి) ఓహో! నా కెంతటియాశ! ఇదేకాఁబోలు బ్రాహ్మణాశయందురు. కాకున్న నీపసివాఁడెక్కడ? బహు సైన్యసమేతుఁడును పరాక్రమవంతుఁడును నగు కాంచనపు రాధీశ్వరుం డెక్కడ? వీఁడు వాని జయించుటెక్కడ? నేనీరా జ్యంబున కభిషిక్తుఁడనగుట యెక్కడ! అసంగతము. అసంగ

తము. కానిమ్ము! ఇట్లనియెదను. (ప్రకాశముగా) చంద్రికాం
తా! గోటితోఁబోవుదానికి గొడ్డళ్ళ ధరింపనేల? కాన నీవిచట
నుండి పొమ్ము. నా కంఠియే చాలును. నీకు సర్వశుభంబులు
చేకూఱఁ గలవు.

చంద్రి—చిత్తము.

చ. మనుమనికన్న నెక్కుడుగ । మన్ననఁ జూపుచు నింత దాఁక న
న్ననిచితివయ్య పండితుఁడ । నంగను నేర్పితి వెల్ల విద్యలన్
జననినిపుత్రిగాఁ దలఁచి । సాకితి వయ్య మహాదరంబునన్
మనమున నీ దయారసము । మర్వకు మయ్య నమస్కరించెదన్.

గురు—బాలకా! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము. లెమ్ము. మీ
యమ్మను గాంచి సుఖింపుము పొమ్ము.

చంద్రి—గురువర్యా! పోయివచ్చెద. (పరిక్రమించుచు) హా! తల్లీ!
మనఃప్రసన్న కల్పకవల్లీ!

మ. సుతుఁడై యేడ్చుచు యేవనాంతరమునన్ । జూడంగనుక్ బోయితో
స్థితి యాతీఱుగనున్నదంచు మదిలో । జింతించి ప్రాణాల బా
సితివో క్రూరమృగారవంబులకు నీ । చిత్తం బెటుల్ జంకెనో
మతి కేమార్గము దోఁచకున్న దకటా । మాంద్యంబు రేకెత్తుటన్.

ఓహో! పరమేశ్వరా!

గీ. కష్టములమీఁదఁ గష్టముల్ । గలుగఁ జేసి
యెంతదాఁక వేధింతువో । యిట్టి దిక్కు
లేనివారము నీదగు । నానగాని
సంచరించెదమో దేవ । సత్స్వభావ.

(నిష్క్రమించును)

---

అరణ్యము

(ప్రవేశము—రత్నమాల)

రత్న—(వెదకుచు) హా! నాథా! చంద్రకాంతా! ఈనీదేవివెందాక
దిప్పలు పెట్టెదవు.

మ. విమలాంతఃకరణా! మహాటవిని నా । ప్రేమైక రాసీ! దురం
తము లిట్లొక్కటిపైని నొక్కటిగ వెం । టన్ జేరి వేధింప జ
న్మమునుపై రోతజనించియే స్థలిని ప్రా । ణంబుల్ విసర్జించితో
అమల స్వాంతయుటంచు నేడ్చు సతితో । నా యిట్టి పర్యాచకాల్.

గీ. అలసితిని ఘోర కాననం । బులను దిరిగి
డస్సితిని యేడ్చియేడ్చి నిన్ । డాయలేక
నిముసమొక్క యుగంబుగా । నిన్ను బాసి
యేడ్చు సతికింక దరిశన । మీ గదయ్య.

(నిష్క్రమించును)

చంద్ర—ఈవనప్రదేశమంతయును వెదకి జూచితి గాని మాయమ్మ
జాడయే గానరాకున్నయది. ఏమిచేయుదును. అయ్యయ్యో!
నాప్రయాసమంతయు వ్యర్థమై పోయెనే!

మ. జననీ! సూనుని గానలేక నడవిన్ । జావందితో లేక నిం
కనునే మూలనునేనియున్ వెదుకుచున్ । గాసిల్లుచున్నావొ నే
మనికాంతుసువాంచెడివాడనమ్మయిటుల । న్యాయంబుప్రాప్తింపఁ జే
యునుదైవంబనియెంచనైతిమునిన । య్యో!యింతదౌర్భాగ్యమే.

గీ. గడచిన కొలంది యెక్కువ । గాగ వెంట
నంటుకొని యేడిపించును । నుండె గాని
తగ్గకున్నవి కష్టముల్ । దల్లి వీటి
కంతరాయము లేకున్న । దమ్మ! యేమి
చేతుమో యమ్మ! నిన్నెట్లు । చూతు నమ్మ?

హా! తల్లీ! రత్నమాల! (అనిమూర్ఛిల్లును)

రత్న—(ప్రవేశించి) వెదకవలసిన తావులన్నియు వెదకితి. గాని నామనోహరుని గాంచఁజాలనైతి నింకేమి సేయుదును? దైవమా!

సీ. మొదట మంత్రికుమారు । నెద భర్త గానమ్మి
తులలేని విరహాగ్ని । దోఁగినాను
పెట్టెలో నున్న రా । పట్టిని బతియంచు
నెఱిఁగి విచారాబ్ధి । నీదినాను
విజనంపుటడవిలో । విధి నిర్గమము లేక
కడ లేని యిడుములఁ । గుడిచినాను,
పర గృహంబునఁ జేరి । పతి విద్యల కటంచు
నోర్మితోఁ గొన్ని నా । ళ్ళుండినాను!
కష్టములు గడ తేఱెను । గల్గుసౌఖ్య
మింక ననుకొంటిఁగాని నే । నీవిధానఁ
బతికి దూరస్థురాలనై । వగచి వగచి
యింత దుర్గతిఁ గంటనే । నెఱుఁ గనైతి.

ఇఁక నాకు మరణమే శరణము. (అని దుఃఖించుచుఁ బరిభ్రమించుచు నేలఁ బడి మూర్ఛలో నున్న చంద్రకాంతుఁడు తన పాదములకుఁ దగులఁ జూచి) హా! జగదీశ్వరా! ఎంత చేసితివి?

సీ. శశి కాంతి నిరసింపఁ । జాలు నీనెమ్మోము
ధూళి బ్రుంగుచు నిట్లు । దోఁగ వలసె!
కెందమ్మి రేకులఁ । గేలి సేసెడు నీదు
కందోయి యీరీతి । గ్రుంగవలసె!
ప్రాజ్య సామ్రాజ్యంబు । భరియింపఁ గలమేను
దిక్కు లేనటు వనిఁ । జిక్కవలసె!

నాడశ్వసీపుత్రు । లాడిన పల్కులా
దురదృష్ట గతినిట్లు । జరుగవలసె!
నాకలీ గతినడియాన । లయ్యెనకట
ఏగతిని దుఃఖపడితివో? । యింతినైన
నన్నుఁ దలపోసి యీయర । ణ్యంబు నందు
యొంటిగానెట్లు మెలఁగితి । వో! హృదీశ.

హా! నాథా! నేను గూడ నీకుఁ దోడుగనేవచ్చెద (అని మూర్ఛిల్లును.)

చంద్ర—(మెల్లఁగా సేదఁ దేఱుచు) ఆహా! ఏమి యీస్పర్శ సుఖము!

గీ. ఇందు కిరణ ప్రసారమో । చందనంబొ
యమృత సేకమొ సంజీవ । నౌషధంబొ
దుఃఖమునఁ గల్గు మూర్ఛను । దొలఁగఁజేసి
మఱల నానంద మూర్ఛనన్ । వరలఁ జేసె.

(అని లేచి చూచి) హా! జననీ! నీవేనా? నాకొఱకయి వెదకి వెదకి వేసరి యిచ్చోటఁ గాంచి నేను మడిసితినని నాతోడ నీవుఁగూడ మడిసితి వటమ్మా లేక మూర్ఛిల్లితివా!

చ. జననము నాటఁగోలె విడఁ । జాలని కష్టములందు ముంచు నీ
తనయుని పైని నింత దయ । దాల్చుట లేమిటికమ్మయిట్లుమూ
ర్ఛను బడియుంటిగాని విడఁ । జాలఁగనైతి మదీయప్రాణముల్
జననిరో! లేచినీసుతుని । జయ్యనఁజూడఁగదమ్మ ప్రొక్కెదన్.

(అని పరిచర్యలొనర్పఁబూనును.)

రత్న—(మెల్లగా లేచి చంద్రకాంతునిఁజూచి) హా! మనోహరా! జీవములఁ గోలుపోతివను కొంటిని బ్రతికియే యుంటివా? ఓ పరమేశ్వరా! ఇంక నేని యీదీనుల రొష్టు పెట్టకుము.

ప్రాణేశ్వరా! నాకొక్కసారి గాఢాలింగనభాగ్యముఁ గలుగఁ జేయుము. (అని కౌఁగిలించుకొని ముద్దాడుచు)

గీ. మఱల నినుఁజూచు భాగ్యంబు । దొరకదంచు
నడలితిని యోమనోహరా! । ఆదురాత్ము
లెంత వలవంతఁబెట్టిరో । యెట్లునిన్ను
బ్రతుకనిచ్చిరో? యొంటరి । పాటు నందు.

చంద్ర—జననీ! దురాత్ములు నన్ను వంచించి ఈ యరణ్యమునకు గొని వచ్చి నాపై లేనిపోని నేరములమోపి నిష్కారణముగ నిరపరాధిని నన్ను నిరాయుధునిఁజేసి వధింప నుద్యమింప నేనప్పుడు దిక్కుమాలి నిన్నుఁ గూర్చి విలపింప నీవు కరుణామయురాలవై యొసంగిన యీఖడ్గ సహాయముచే నాతులువ లవధించి నా రాకకెదురుజూచుచుఁ బరితపించుచుందువని బిర బిర నేనా గురుని యింటికరుదేర నీవీ యరణ్యంబున నన్ను వెదుకవచ్చితివని వారివలన విని నిన్ను వెదకు కొనుచు మ ఱల నిటఁబ్రవేశించి యెందునుగానక దుఃఖాక్రాంతుఁడనై మూర్ఛిల్లితిని. పిదప నీకరస్పర్శనుహాభాగ్యంబున నేద దీఱి నిన్నుఁ జూడఁగల్గితిని.

రత్న—నాథా! నేనప్పుడీ కత్తి నొసంగలేదే. కరుణాస్వరూపుఁడగు పరమేశ్వరుఁడో, భక్తవత్సలయగు భవానియో ప్రసాదించి యుందును.

చంద్ర—తల్లీ! ఎందాక మనకీ కష్టములు? ఎందాక మనకీ వనవాసము? చూఁడుము.

గీ. ఈశ్వర ప్రసాదితమైన । యీకృపాణ
ధారచే ధాత్రిని జయించి । తగిన రీతి

ప్రభుఁడనై చేయుదును ప్రజా । పాలనంబు
ధర్మ సంస్థాపన మొనర్తు । తల్లి రమ్ము.

రత్న—ఆర్యపుత్రా! నీవు సమస్తవిద్యాపరిపూర్ణుఁడవై రణధర్మం
బుల నెఱింగినపుడుగదా దిగ్విజయార్థమై బయలుదేరుట?
అంతను యొంటరివాఁడవు.

చంద్ర—తల్లీ! నీకీ విచారమేలనమ్మా వెంట్రుకకు గొండకు ముడి
వేసి లాగుదును. వచ్చునా? కొండ వచ్చును. లేనా! వెంట్రు
కొక్కటియే పోగలదు. అంతియగాక—

గీ. క్షత్రియుఁడ నా చు బుట్టి లాం । ఛనముగాగ
చేతఁ గత్తి ధరించి నా । చేవఁ జూప
కుండ యూరక నిట్టు । గోళ్ళు గిల్లు
కొనుచు గూర్చుండ దగదె! లో । కులను నగరె.

మఱియు—

గీ. సకలవేదంబులును శాస్త్ర । చయము సమర
ధర్మములు లౌకికములు సాం । తంబుగా కృ
పాముయుండ గు కాండవ । భట్టునేర్ప
దెలియగాలేదె యోమాతృ । దేవి మున్న.

రత్న—ఆర్యపుత్రా! శాస్త్ర చయమునందు శృంగార శాస్త్రము
గూడ నున్నది గదా! సకల శాస్త్ర పారంగతుఁడ వైనచో
నన్న మ్మాయని పిలుతు వేం?

చంద్ర—ఏమని పిలువవలయును?

రత్న—ప్రియురాలా! యనవలయును. ప్రాణేశ్వరీ! యనవలయును.
మనోహారిణీ! యనవలయును.

చంద్ర—ఇదియసంగతము. ఈసంబోధనంబులు భార్యలపట్ల నుప
యోగించునవి గాని తల్లిపట్ల గానేరవు. నామనోపరిశీలనంబు
నకు నీవుక్షమించినను నే నంత బుద్ధి హీనుఁడను గాను.

రత్న—ఆర్యా! నీవు పరిజ్ఞాత వైతివపుడే నీకు నేను భార్యనని విన్న
వించుచున్నాను.

చంద్ర—(కోపముతో) ఛీ! ఛీ! పాపాత్మురాలా! ఏమి యీప్రేల
డములు మానుము. మానుము. ఇంతవఱకును నాచిన్ని
యేలికా, ఆర్యపుత్రా యిత్యాది సంబోధనంబుల బ్రయో
గించుచుండ నేమోయను కొంటిని గాని నీకింతటి దురుద్దే
శముతో యుంటివని యెఱుంగను. తొలుతనే నింతటి క్రూర
స్వభావురాలవని యెఱిఁగినచో యింత దనుక నీతోడ
నుందునే? నీముఖముఁ జూతునే? నిన్నుఁ బలుకరింతునే!
ఎంత ఘోరము. హా! పరమేశ్వరా! నేఁ డెంతటి దుర్దినము?
ఎంతటి విపరీత వాక్యముల వినవయ్యెను. శివ శివా! అమ్మా
నీవింక నిట్టి తలంపులఁ గట్టిపెట్టుము. నన్నుఁ గనుపారఁ గని
చేతులారఁ బెంచి తుదకు నారూప శీలనములఁ జూచి నీవే
వెడఁగుతలంపుఁ బూనితివా? ఛీ! ఛీ! ఉవిద లెంతటికార్యము
లకైన దెగింపఁగలరు. కావుననే—

గీ. కన్నెగానున్న కాలాన । కన్నతండ్రి
యౌవనావస్థలోనున్న । యపుడు భర్త
ముసలి తనమున కొమరుండు । బ్రోవ వలయు
నువిద కేవాఁడు స్వాతంత్ర్య । మొసఁగ రాదు.

ఓ జారిణీ! ఇట్టి దుష్టురాలిని వధించుట యే క్షాత్రధర్మమైనను
ప్రథమ దోషంబగుట మిన్నకుంటిని. ఇఁకమీఁద నిటులాడ వలదు.

రత్న—(భీతితో తనలో) ఈ మానధనునకు నేనెటుల నమ్మకము
బుట్టించుదాన. నాకు మంత్రి కుమారుఁడు వీనికిఁ బ్రక్క
పొత్తిగా బెట్టిన పెట్టిలోనిపత్రికను ప్రాణపదిలంబుగా దాచి
యుంచితిని. దానినితనికిప్పుడు జూపుట యే కర్తవ్యము

(ప్రకాశముగా) ఆర్యా ఏకార్యమునకుఁగాని ముందుగాఁ దొం దరపడుట యుత్తమముకాదు. ఈపత్రికయెద్దియో యెఱుం గుదువే? (పత్రికనిచ్చును)

చంద్ర—(చదివి) ఇంతమాత్రమునకే యిది ప్రమాణమగునా? కామ పిశాచముచేనావరింపఁ బడిన కులటలు యిట్టి పత్రి కలఁ గల్పించు చుండుట లోకస్వభావము (పత్రికను జించి వేయును)

రత్న—దైవమా నాబ్రతుకు నెంతటి హైన్యదశకుఁదెచ్చితివయ్యా! నాకీ యిక్కటుల సముద్రతరంగముల భాతిఁ జూపించుచుం టివే! ఏమిచేయుదాన—

గీ. మగని గానమ్ము తొలినుండి । మిగుల ప్రేమఁ
బెంచి సుఖము లనందెద । నంచు నెంచి
ఆకలికి దప్పికకు నోర్చి । సాకినాను
యిటుల ఘోరంబు ప్రాప్తిల్లు । టెఱుఁగ నైతి.

ఉ. నమ్మఁడు కమ్మనీకఁడుగు । నంబగు కష్టము నందుదోంచి దుః
ఖమ్ము నకందుఁ జూవక జ । గంబును వీడగ నీకయింతదా
నిమ్మెయి శోధఁ జేతువిద । యేవిధి ధర్మము గాఁగఁ దోఁచెనో
యమ్మరో యింకనేని కృప । నారసి సత్యముఁ దెల్పు మీశ్వరీ.

కాళి—(ప్రత్యక్షమై) రా కుమారా! ఏల తొందర పడి వెదవు! ఈ సాధ్వి నీభార్య యగుట నిశ్చయము. నీ వీమెను గూడి సుఖింప దగును. ఈ సుగుణాలలామ భూలోకమునఁ బతివ్ర తాధర్మం బులవెల్లడింప మదీయాంశంబున జన్మించినది. నీవును మదీయ పంచ ద్వింశతి తత్వంబగు సదాశివుని యం శంబున లోక రక్షణార్థ మవతరింపఁ బడితివి. కాన నీపవిత్ర చారిత్రమును శ్రద్ధా భక్తులతో వినువారికినిహపర సుఖం

బులు గలుగును. మఱియు నీజననీ జనకులతో నీకు శీఘ్రకా లంబుననే సమావేశముఁ గల్గి సర్వ శ్రేయములును చేకూ రును. నేనింకఁ బోయెదను.

(నిష్క్రమించును)

చంద్ర—(తనలో) ఆహా! ఏమి! ఈమె నాభార్యయా! ఇది యేమి రాత! ఇందులకు శార్వాణియే ప్రత్యక్షసాక్ష్యమా? ఎట్లు నమ్మకుందును? ఇందులకుఁ దోడుగా నీమె పరమపతివ్రతా మణి యని గూడ వక్కాణించినదే. అయ్యో! ఈ నాప్రాణ సఖిని క్రూరుఁడనై నేనెంతతూలనాడితిని? (ప్రకా) అమ్మా! నాలుకఁ గఱచుకొని .కాదు. కాదు. ముద్దు గుమ్మా! నాబంగరు బొమ్మా! ఈ నీప్రియుని లోపంబును సైరింపుము. (అని చేరుకొన దగ్గఱకుఁ బోవును)

రత్న—(వెనుక కొదుగుట నభినయించి) ఓమహానుభావా? మీా వలనలోపమా!

గీ. జారిణిని టక్కులాడిని । చంచల స్వ
భావురాలిని మూర్ఖను । పరమ నిష్ఠ
మొలఁగు మీావల్ల లోపముల్ । గలుగు నొక్క
పాతకమువచ్చి ముట్టుట । వలన నన్ను.

చంద్ర—తల్లీ! (మఱల నాలుకఁ గఱలచుకొని) కాదు. కాదు. ఎంత మందభాగ్యుఁడ నగుచుంటిని! సద్గుణకల్పవల్లీ! తెలి యక పలికినపలుకులకీ యాగ్రహామేటికి?

గీ. రమ్మ నీప్రియునకుఁ గౌఁగి । లిమ్మ ఒక్క
ముద్దునిమ్మ దాసుని తప్పు । దిద్దుకొమ్మ
నొక్క గానిమ్మ నీముద్దు । చెక్కిళులను
కొమ్మ నావేడుకో లంది । కొమ్మరమ్మ.

రత్న—(తనలో) ఆహా! ఏమి వీని శృంగారరసము! హృదయమెంత వేగిరపడుచున్నను, నానాథుని కిప్పటి కేనియుఁ గృపఁగల్గిన దని సంతోషమెంతగా నుప్పొంగుచున్నను నాయొడయుని రవంతసేపు పరీక్షింతమను భ్రాంతి కలుగుచున్నయది. (ప్రకాశముగా) చాలును. చాలును. దూరముగ నుండుఁడు.

గీ. అడవిలోఁ బెంచి నట్టి నీ । యమ్మఁగాన
యమ్మ కొమ్మగ మారెనే । యాగడంబె
తులువ పోకలు ధర్మమే । దూరముగను
నిలిచి మాట్లాడు మయ్య వే । పలుకు లేల?

అయినను నీయసందర్భపు ప్రలాపములతో నాకేటి పని నేను పోయెదను (అని వెడల నుద్యమించును)

చంద్రి—(రత్నమాల పాదముల మీఁదఁ బడిపోకుండ బట్టుకుని)

క. చల మేటికి ననుఁ నేలుము
కలివేని నువిడిచి బ్రదుక । గాగలనో కో! హా
చిలుకల కొలికీ మన్మధు
ములికీ నాతప్పు సైచి । బ్రోవవె కృపమై.

రత్న—(లేవనెత్తుచుఁ జెక్కిలినొక్కి ముద్దుగొని) నాధా! ఈతప్పు మీదియుగాదు. నాదియుఁగాదు. దైవము మన మనోధార్ఢ్య తలఁ బరిశీలించి మనచరిత్రను లోకంబునఁ జాటుటకు గల్గిన యొక విచిత్రనాటకము. మన కష్టంబులు నేటికి ఫలించి నానోము లన్నియు, గరిగాంచినవి.

చంద్రి—(సంతోషముతో గాఢాలింగన మొనర్చి) ఓ కురంగలోచనా! మన మీ మనోహరంబగు వనంబునఁ గొంత తడవు విహరించి పిమ్మట మదీయ భుజ పరాక్ర మార్జిత ధరణీతల సామ్రాజ్యంబున నాగరక సుఖంబుల ననుభవింతము రమ్మా.

(నిష్క్రమింతురు)

## తపోవనము

కాషాయాంబర ధారులైన చంద్రచూడుఁడును వానిభార్య యుఁ బ్రవేశము

చంద్ర—సాధ్వీల లామా! చంద్ర వదన నిరంతర చింతా దురంత మగు రాజ్యతంత్రంబును స్వేచ్ఛావిహారంబును, భండనాగారంబును దైవ ప్రాతికూల్యంబునఁ దప్పిపోయి నను వరమ పావనంబగు నీ తపోవనంబునఁ దాపసోత్తములతో సద్గోష్ఠితో మునివృత్తితో నుండుట నాకెంతయో యానందదాయకముగ నున్నయది సుమా.

భార్య—ఆర్యపుత్రా! అతుల వైరాగ్య యుక్తులను సాధన చతుష్ట యి సంప దాసక్తులును, నిరంతర బ్రహ్మవిచారరక్తులును, నగు మీా కైహికసుఖంబులు దుర్భరములుగ దోచుచుండు టచే మీా మనంబానంద వారిధిలో మునిగియున్నది కాని స్త్రీస్వభావసులభంబగుటచే బుత్రవియోగమును భరించుట మాత్రము నాకుఁ గష్టముగనే యున్నదనుఁడీ.

(అంతఁ జంద్రకాంతుఁడును రత్నమాలయుఁ బ్రవేశము)

చంద్ర—సతీమణీ! జూఁడు మాలేడిని!

గీ. మిగుల పొడవైన యానేత్ర । యుగళి . . . డ
నడలు చాలేడి యేరికి । నందనటుల
పర్విడుచు వచ్చుచున్నది । భామజూఁడు,
చుఱుకు జూపుల నీదెస జూచుచుండు.

రత్న—ప్రియా! నాకీ లేడినిగూడి యాడుకొన ముచ్చటగుచున్నది.

చంద్ర—సుందరాంగీ! మొదటనుండి యుపవనాంతరముల నలవడిన నీకాలేడిపై నిప్పుడింత వేడుక యేల జనించినదో!

రత్న—హృదయేశ్వరా! ఆదికాలమునందలి మార్పు!

రాజు—(చూచి) మీ రెవ్వరు? పరమశాంతంబగు నీతపోవనంబున సుఖంబుగఁ గాలంబుఁ బుచ్చుచున్న నాహరిణము జోలికిఁ బోనేల! శృంగార విహారానుకూలములగు యీయారామంబు లన్నియుఁ బాడువడి పోయెనే?

చంద్ర—తాపసోత్తమా! క్షమింపుఁడు. నేనారీతిని వధింప రాలేదు. ఈ నాప్రియురాలు దీనితోఁ గ్రీడింపఁ దలంచుటచే పట్టుకొని సమర్పించి యీమెకోరికఁదీర్ప నుద్యమించితిఁ గాన క్షమింపుము.

రాజు—(తనలో) ఆహా! ఈతని క్షమాగుణసంపద నాకచ్చెరువు గలిగించుచున్నయది. ఇంతియగాక నీతనిమూర్తివంతమును బట్టి క్షత్రియకులోద్భవుఁడని చెప్పకఁ జెప్పుచున్నది. (ప్రకాశముగా) రాకుమారా! అట్లయినఁ జాలనలసితివి. రవంత తడవీ వృక్షచ్ఛాయను విశ్రమింపుము.

చంద్ర—మంచిది ప్రేయసీ రమ్ము. ఈమహానుభావుని యాజ్ఞ శిరసావహింప వలయును. అని (కూర్చుందురు)

రాజు—హా కుమారా! మీ సంభాషణమును బట్టి చూడ మీరిరువురును క్షత్రియదంపతుల వలెఁ గనఁబడుచున్నారు. మీరీ విపినస్థల విహారమొనర్పఁ గారణమేమో తెలిపెదరా?

చంద్ర—(రత్నమాల వైపునఁ జూచును)

రత్న—మహాత్మా ఈమహాసీయుఁడు నాభర్త. చంద్రచూడుని గారాబంపు పుత్రుండు.

రాజు—(ఆతురతతో) ఆఁ! ఆఁ! ఈతఁడు చంద్రకాంతుఁడా? నాకుమారుఁడా? నిజమా? నిజమేనా? చెప్పుము చెప్పుము.

గీ. రార నాపుత్ర సుకుమార ! వీర ధీర
శూర ముద్దీయరా తండ్రి ! సుగుణవర్య

చంద్రకాంతు డవను పేరు । సార్థకముగ
యీగతి నున్న మమ్ముల । నేలుకొనరా.

భార్య—(కుమారుని కౌఁగిలించుకొని)

గీ. తనయ ఏనాఁడు చూచితో । దనివిఁదీఱ
మురిపె ములనింపు నీముద్దు । మోముతండ్రి
పాప మిటు బ్రిద్ద లయ్యె నో । వననివాస
మబ్బె నది యేవి ధానమో । యరసి నాకు

చంద్ర—(రత్నమాలఁ జూచి) ప్రాణేశ్వరీ! ఈమునిదంపతులు నన్నుఁ దమపుత్త్రునిగఁ దలంచుచున్నారు. నేను మునికుమారుడనా యేమి?

రత్న—(నవ్వుచు) కాదు కాదు. తమరు సరియగు రాకుమారులే. యోగమునకుఁ సంహింపఁ జాలమి జననీ జనకులు సర్వసంగ పరిత్యాగులై సీతపోవనంబునఁ గాలంబు బుచ్చుచుండ నోపు. వీరు మీతల్లి దండ్రులన సందియము లేదు.

చంద్ర—దేవా! తమరు చంద్రచూడమహారాజులా?

రాజు—ఔను. మందభాగ్యుఁడను నేనే. కన్నకొమరుని నట్టడవుఁ పాలు జేసిన పాపచరిత్రుడను నేనే ఈమెనీజనని. పుత్త్ర వియోగమును భరింపఁలేక నేడ్చియేడ్చి కృశించి యీవిధి నున్న మీతల్లి చంద్రవదన యీమెయే.

చంద్ర—జననీ జనకులారా! వందనంబులు.

రత్న—మామగారికిని, అత్తగారికిని నావందన సహస్రంబులు—

చంద్ర—తండ్రీ!

గీ. తూత్రమున్ బరిత్య జించి కా । షాయవస్త్ర
ధారులయి యీ విధంబున । దప మొనర్చు
కొనఁగ గతమేమి మీరును । జననియు నిటు
వనము లందుం డగత మేమి పలుకుఁ డయ్య.

రాజు—కుమారా! పండ్రెండేండ్ల వయసుగల కన్నెను నీకుఁ బండ్రెండుదినంబుల ప్రాయము మించకుండఁ బరిణయ మొనర్చినచోఁ జిరంజీవి వయ్యెదవని జగదీశ్వరుం డాజ్ఞనొసంగ బాలుని నిన్నొక పెట్టెయందుంచి యాపెట్టె కీయా రత్నమాలను వివాహ మొనర్చితిమి. పిమ్మట నీమహాపతివ్రత తనకు సంభవించిన వధాభవమునకు లజ్జించి నలువురిలో దలయెత్తలేక పెట్టెలోనున్న నిన్ను నిర్జనవనంబునకుఁ దోడ్కొని పోయెనని విని సింహకేతుండు కోపించి నాపై దండెత్తి జయించి నీజననితోనుగూడ నన్ను గారాగారమున నుంపించెను.

చంద్ర—(కన్నీరుఝళిపించుచు) తరువాత తరువాత.

రాజు—పిమ్మట బంధనాగారమున గల్గిన శోకమును భరింపజాలక నీశ్వరానుగ్రహంబున దానిఁ దప్పుకొని నీవన ప్రవేశ మైతిమి.

చంద్ర—జననీ జనకులారా!

మ. ధరణీ భాగము సంచరింపగ నియ । ద్భాగంబు కంపింపగా
దురమందు ద్ధురతన్ దురాత్ము వధి యిం। చున్వాని రక్తంబుతో
హారుఁడెన్నో గతులన్ నుతింపఁ బరమా । హ్లాదైక చిత్తుండనై
వర సామ్రాజ్యపు పీఠమం దునిచెదన్ । పాలించెదన్ ధర్మమున్.

రత్న—భయముతో (దనలో) అక్కటా! ఏమి సేయుదాన ఈమహాసీయుడెంతటికైన దగిన వాఁడు. హా జనకా! చిట్టచివఱకు నీ మరణంబు నకుఁ గూడ నేనే కారకు రాలను గావలసి వచ్చెనే! ఇప్పుడీ తని వారింపఁ జూచిన వీనికిఁ గోపకారణమగు దునే! ఏమియు దోచ కున్నది. హా విధీ! ఈ నిర్భాగ్య రాలి కిప్పుడె య్యది కర్తవ్యము.

చంద్ర—తండ్రీ! కాత్యాయనీ వర ప్రసాద లబ్ధంబగు నీచంద్ర హాసంబున నీచంద్రకాంతుఁడా పాపాత్ముని యారాక్షసుని యాసింహకేతుని చెండాడ గలఁడు గండు. కుమారుని పరాక్రమంబును కనుల కఱవు దీఱ బరికించి సంత సింతురు గాక.

(నిష్క్రమింతురు)

రంగము సభామంటపము—

(సింహకేతుఁడును దీర్ఘదర్శియును)

సింహ—దీర్ఘ దర్శీ! రత్నమాల వృత్తాంతమిప్పటికేనియు తెలియ దుగదా?

మంత్రి—లేదు మహా ప్రభూ! ప్రయత్న లోపము లేకుండ జారులచే వెదకించుచునే యుంటిమి.

సింహ—నాకా కొమరితను జూచుకొని సుఖపడు యోగ్యత లేదు లేదు.

గీ. మురిపె మొలయఁగ బెతిగిన । ముద్దు కూతు
నెప్పుడా మాయ వ్యూహాన । నిచ్చు తోడ
నొప్పగించి తో యొప్పుల । కుప్ప పైని
నాశ యానాడె తీఱెఁ గ । దయ్యనాకు.

(పిమ్మట చంద్రకాంతుఁడు తల్లి దండ్రుల తోడను భార్యతోఁడను ప్రవేశము)

కీర్తన—బ్యాంగుస్వరము

చంద్ర—

పొంకమ డంతు రా। పోరు మియ్యొడన్
జంకు లేక నా । జనకు బట్టితి
వింక నిన్ను నే నెట్లు విడుతురా । శంకరా దులన్

శరణుఁ జొచ్చినన్ శంక మాలినిఁ । జంపకుందునా పొం॥

సింహా—

ఓ దురాత్మకా! ఓ నిశాచరా

నాదు శరములన్ దూల్చు వాఁడరా

వాదమేలరా పోటరివైన్

నిలిచి పోరరానీచుడా.

చంద్ర—(గర్వముతోఁ బ్రకటించుచు) ఈకపటశీలుఁడు కారాగార ములనుండి యెటుల దప్పించుకొనియెనో? కానిమ్ము! ఓరీ! బాలకా!వయస్సున జిన్నవైనను కూతలు ఘనంబుగనున్నవే! ఇంక నిన్ను క్షమింపరాదు. రారమ్ము. నాఁడే సంహారింపకఁ గరుణచే విడుచనీవు చెదపురుగునకు ఱెక్కలబ్బినటుల మిట్టి పడుచున్నావు. కాచుకొనుము. (యుద్ధమునకుఁ దలపడి చంద్రికాంతుని కార్యమినుమడింప)

రత్న—(చేతులు జోడించి)

క. జనకు నకు మామ గారికి

గన భేదము గలదె కృపను । గావుము వీనిఁ

మనమునఁ బూజ్యుండనుచున్

గన వేడెద నాథ మిమ్ము । గలుగు శుభంబుల్.

చంద్రి—ప్రియురాలి నూతన ప్రియ ప్రార్థన నువశ్య మన్ననీయ మగుట విడిచితిని.

రత్న—జనకా వందనంబు. తొలుత మీవియ్యంకుని నల్లుని గౌర వింపుము.

సింహా—తల్లీ! రత్నమాలా

గీ. మగని వసి వాని కేగతి । మనిచితమ్మ

యింతకాలంబు నీవెట । కేగితమ్మ

తల్లి దండ్రుల విడనాడ । ధర్మమమ్మ
అత్తమామలు నీకెట్టు । లబ్బిరమ్మ.

రత్న—తండ్రీ! జరిగినదెల్ల సావకాశంబుగ నావలన వినవచ్చును.
తొలుత నీమహనీయు నాదరింపుము.

సింహ—తల్లీ! సంతోషాధిక్యతచే నేనొడలుమఱచితి. (వియ్యంకుని
చేతులు బట్టుకొని)

మ. కరుణాస్వాంతుఁడనై క్షమింపఁదగుము । త్కార్యంబులన్ఫుత్రిదు
ర్భర సంతాపములందుఁ జిక్కుటలు । ప్రాప్తంబౌట రోషంబుచే
దురితంబుల్ బచరించినాఁడను మహా । త్మున్నిన్ను వేధించుటల్
మరువంగాఁదగు బావగారు విధిని । ర్మాణము నార్యంబయ్యెడిన్.

(చంద్రకాంతుని కౌగిలించుకొని)

గీ. అల్లునిన్ నిన్ను గాంచి నే । నధిక కీర్తి
బడయఁ గల్గితినాడు నం । గడము మిగుల
నున్నతికినెక్క నాదగు । పున్నెమెల్ల
నీస్వరూపంబు చేనిట్లు । నిలిచె నార.

రాజ్యంబునకుఁ బట్టభద్రుని జేసెదరమ్మ.

చంద్ర—బావగారూ! నాకును బెద్దకాలమయ్యె. నా రాజ్యమునకుఁ
గూడ వీనినే బట్టభద్రునిగ మీచేతిమీఁదుగ నొనర్చెదు.
మనమింక సుఖంబుండెదము.

సింహ—అట్లే యొనర్తుము.

పిమ్మటఁ బట్టాభిషేక మొనర్తురు.

(సంపూర్ణము.)

(కొలదిదినములలో వెలువడును.)

జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య గారిచే

రచింపఁబడిన నవలలు.

## వజ్రహారము

ఇందు మనోమోహన కరములగు కథ లనేకములు గలవు. ఒక్కొక్కకథ ఒక్కొక్క గొప్ప నవలతోఁ దులతూఁగును. ఈకథలను చదివినచో ప్రతివారును నవలల నతిసులభముగ వ్రాయఁగలరు. ఒక్కొక్కకథ ఒకవిలువగల వజ్రముతో సమానము. ప్రతికథయును మనోల్లాసకరముగా నుండును. అన్నియును ఆనంద రసభరితములగు కథలే. వెల రు 1—0—0



## హత్యాన్వేషణము

మనోహరమగురహస్యావరాధపరిశోధకనవల. భాషలలితము. కథావిధాన మత్యద్భుతము. హంతకుఁడగుశరశ్చంద్రఘోషు యొనరించిన సాహసకృత్యములు, హత్యాన్వేషణమునందు అపరాధపరిశోధకుఁడగు రమేశచంద్రబాబు అనుభవించినకష్టములు చదివినవారందరును ఆశ్చర్యాన్వితు లగుదురు. ఇది నిజముగా చదువఁదగిన నవలా రాజము. వెల రు 0—12—0

వలయువారు:—

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు,
నేషనల్ బుక్ డిపో, రాజమండ్రి.

## నాగరాజా ఋతుసూల నివారిణి

స్త్రీలపాలిటి వరప్రసాదము వెల బుడ్డి 1కి 1—8—0

వలయువారు:—

వంటెద్దు నాగయ్య అండ్ కో. రాజమండ్రి.

సరస్వతీ పవర్ ప్రెస్—రాజమండ్రి.